కండనొప్పి
ఎంత ఎక్కువగా ఉన్నా
స్థానికమే

# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహౌషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2818

సంక్రాంతి శుభాకాంక్షలతో

వస్త్రాం

అద్భుత అపరాధ పరిశోధక







పూర్ణా
రిలీజ్

గౌరి ప్రొడక్షన్స్

# లోగుట్టు పెరుమాళ్ళకెరుక

నిర్మాత: S. భావనారాయణ  దర్శకత్వం: K.S.R. దాస్

మాటలు-పాటలు: వేటూరి  సంగీతం: కోదండపాణి  కెమెరా: వేణు

NAVRANG

ఎస్ వి రంగారావు
హరనాథ్ బాలయ్య చలం
ప్రభాకరరెడ్డి రావికొండలరావు
కృష్ణకుమారి, రత్న
గెస్ట్ ఆర్టిస్ట్ సావిత్రి

మాటలు పినిశెట్టి
సంగీతం వేదా
ఫొటోగ్రఫీ ఎస్ ఎస్ లాల్

ఆంధ్రప్రదేశ్
డిస్ట్రిబ్యూటర్సు
అనీల్ ప్రభాస్
ఎంటర్‌ప్రైజెస్ (K)

మోడర్న్ థియేటర్స్
102 వ చిత్రం



# మొనగాళ్ళకు మొనగాడు

ప్రొడ్యూసర్ ఆర్. సుందరం B.E. డైరెక్టర్ ఎస్. డి. లాల్

# ఉత్తరాలు

### వైజ్ఞానికగాథాశతి

31—12—65వ తేది ఆంధ్ర పత్రిక వారపత్రికలో 'డాక్టర్' వ్రాసిన 'వైజ్ఞానిక గాథాశతి—కవి సమయాలు' చదివేను. అది చదివిన తరువాత నాకొక్కటే సందేహం వచ్చింది—ఆయన ఆ శీర్షిక క్రింద, అందరికీ సులభగ్రాహ్యంగా, వైజ్ఞానిక విషయాలు చెప్పదలచుకున్నారా? లేక ఆ నెపంతో శాస్త్రవిషయాలకు పూర్తిగా భిన్నమైన కవిత్వాన్ని, కవులని విమర్శ చేయ దలచుకున్నారా? ఆయన మనవారి కవిత్వాన్ని, ఆవి వూహలనూ తీసుకొని, "మనవారికి సోదాచేసే గుణము తక్కువ" అన్నారు. ఇది చాలా హాస్యాస్పదంగా ఉంది. ప్రతిదేశంలోనూ ప్రతికాలంలోనూ కవి, శాస్త్రజ్ఞుడు ఇద్దరూ ఉంటారు. ఒక దేశంయొక్క ప్రజల్లో 'సోదా చేసే గుణము' ఉన్నదా, లేదా యని నిర్ణయం చేసేటప్పుడు, ఆ దేశంయొక్క శాస్త్ర ప్రగతిని, లేక ఆ దేశపు శాస్త్రజ్ఞులు వ్రాసిన వైజ్ఞానిక గ్రంథాలను పరీక్షించాలి. అంతేకాని, ఆ దేశపు కవిని, కవిత్వాన్ని ప్రమాణంగా తీసుకోరాదు. దేశం, కాలం, వైజ్ఞానికంగా ఎంత ప్రగతిని పొందినప్పటికీ, కవి తన వూహాగానాలను, మానడు. కవికి కూడ అవి వూహాగానాలని తెలుసు. అందుచేతే వైజ్ఞానికంగా ఎంతో పురోభివృద్ధిని పొందిన అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కూడ కవులున్నారు. అంతమాత్రంచేత అమెరికన్ కవుల వూహాగానాలను ప్రమాణంగా తీసుకుని, అమెరికన్లకి 'సోదాచేసే గుణము' లేదనడం ఎంత హాస్యాస్పదమైన విషయమో అందరకూ తెలిసినదే.

అందుచేత నేను 'డాక్టర్' గారిని కోరే దేమిటంటే, శాస్త్ర చర్చలలోనికి భారతీయ కవిని ఈడ్చి, అతని వూహలను ప్రమాణంగా తీసుకొని, భారతీయుల 'సోదా చేసే గుణము'ను శంకించవద్దని. ఆయన అన్నట్టుగా భారతీయులలో 'సోదా చేసే గుణము' లేకపోయినట్టయితే, భారతదేశానికి చరకుడు, శుశ్రుతుడు, నాగార్జునుడు, ఇంకా ముందుకుపోతే, రామన్, వర్లేకర్ మొదలైనవారు ఉండి ఉండకపోయేవారేమో.

అధ్యాత్మరామం (శ్రీకాకుళం)

### పసిడిమనసులు

"పసిడి మనసులు" సీరియల్ చాలా బాగుంది. ముఖ్యంగా కథానాయిక పన్నెంతో ఆకర్షించినది. చెన్నైలికొరకై రజని తన శీలమును పాటగను వేయుట చాల గొప్ప విశేషముకదా. ఇటువంటివాళ్ళు మాటికి ఒక్కరు వుంటారేమో. 'అందరిచేత స్వార్థ పరురాలిగా అనిపించుకొన్న సావిత్రిని నేనే నమ్మా జ్యోతి' అని రత్న చెప్పినప్పుడు ఈ కథ జరిగినట్లు అనిపించినది.

సి. ఏ. కుమారి (నాగాయతిప్ప)

### పుస్తకాలు

24—12—65 సంచికలో నా "వసంతము"పై చంద్రశేఖరిగారి విమర్శ చూశాను. వారి మేధాశక్తికి సంతసించాను. తుదివరకు చక్కనివారు సంకలన కర్తయని "నేను"అంటే నేనే అనగా జయరామిరెడ్డి అని తెలియకనా వారు ఆవిధంగా వ్రాశారు అని నా అనుమానం.

ఇక విమర్శకులు కవరుమీద సంకలనకర్త లెవరు? విషయసూచికలో కవులెవరు? అని మాత్రం పరికించి, తుదివరకుమాత్రమే చదివారులావుంది. కాకపోతే అసలు విషయాన్ని చర్చించక ఏవేవో ఎవరు ఏమి వ్రాశారో అని మాత్రమేచూచి వదిలారు.

కె. బి. జయరామిరెడ్డి. (ఈ. తాండ్రపాడు)

* * *

24—12—65 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో శ్రీ టి. హరిబాబుగారు రచించిన 'అమ్మకోసం' అదితర ఏకపాత్రాభినయాలు గురించి శ్రీ రామచంద్రమూర్తిగారి విమర్శ చదివిన తర్వాత ఇలా వ్రాయాలనిపించింది.

ఏమంటే 'అమ్మకోసం' ప్రదర్శించాలని, అత్యంత శ్రద్ధతో కృషి చేస్తున్నవాళ్లలో నేనొకణ్ని! 'అమ్మకోసం' అనేక ఉత్తమ బహుమతులుపొంది ప్రశంసలనందుకొంది. దాన్ని చదివి నరనరాల్లో జీర్ణింపజేసు కొన్న వాళ్లకే తప్ప, దాని మాధుర్యం ఇతరులకు అంత త్వరగా జీర్ణంకాదు. నాటి విమర్శనవలన శ్రీ రామచంద్రమూర్తిగార్కి నాటకీయత రంగస్థలానుభవం ఏమాత్రం లేదని తేలిపోయింది. ఉత్తమ నటులే దాంతో ఎంతగానో కుస్తీ పడితేనేతప్ప, దాని ప్రదర్శన ద్వారా ఉత్తీర్ణుడ్ని అయ్యానని చెప్పే అర్హతలేదు. ఉన్నత నటనాస్థాయిని ప్రతిబింబింపచేసే, ఏకపాత్రాభినయం అమ్మకోసం—

ఇక ధనవంతుల్ని తిట్టారన్న వారి అభియోగం ఏమంత సమంజసంగాలేదు. ఎందుచేతనంటే, మన సర్వోదయ నాయకులు శ్రీ వినోబా భావేగారి ప్రసంగాన్ని పేపర్లో చదివాను— "అసలీ ధనవంతులే దారిద్ర్యానికీ, అవినీతికి, సమాజ నాశనానికి కారకు" లని. నేను రెండు మాటల్లో తెలియజేసాను. కొన్నాడిగితే, ఆ ప్రసంగం చదివిన ధనవంతులు ఎవరైనా, ఉండి ఉంటే వాళ్లకు ఆత్మసాక్షి వుంటే, వెంటనే పురిపోసుకొని వచ్చి ఉండేవారు. ఆ సత్యాన్నే దాటి చెప్పారు రచయిత హరిబాబు.

ఇకపోతే సిపాయి— పాకిస్తాన్— రాక్షసత్వం గురించి వీరి ఉద్దేశ్యం హాస్యాస్పదంగా ఉంది. సిపాయి 1964 లో బందరులో జరిగిన ఆంధ్ర యన్. సి. సి. క్యాంపులో ఉత్తమ బహుమతి లభించిందని రచయిత తెలియజేసారు. ఇది అవాస్తవమా? కాగా! ఉన్నత స్థాయి మిలటరీ ఆఫీసర్లు దానికి ఎందుకు ఉత్తమస్థాయి బహుమతి నిచ్చారు.

ఇకపోతే, 'పాకిస్తాన్—రాక్షసత్వం' అదో మహత్తర కళాసృష్టి. దాన్ని ప్రదర్శించే ధైర్యం అందరికీ వున్నదంటే వాళ్ల అభిప్రాయంతో నే నేకీభవించలేను.

శ్రీ హరిబాబుగారు చైనా పాక్ నాయకుల్ని కుంకలని, వెధవలని దూషించి వ్రాశారని శ్రీ రామచంద్రమూర్తిగారు ఆరోపించారు. అయితే వాళ్లను మరేవిధంగా దూషించాలి? పాలిచ్చిన తల్లి రొమ్ములో క్రూరంగా బాకులు దించిన ఆ నరరూప రాక్షసుల్ని మరేమని దూషించాలి? భారతమాత గుండెల్లో యుద్ధ జ్వాలలు రగిల్చిన ఆ ముష్కరుల్ని ఏమని అనాలి?

మొన్నమధ్య ఐక్యరాజ్యసమితిలో మన కేంద్ర విదేశాంగమంత్రి సర్దార్ స్వర్ణసింగ్ గారు, పాక్ విదేశాంగ మంత్రి భుట్టో దుర్భాషలు వినలేక సభ బయటికి వస్తూంటే, భారత కుక్కలు పారిపోతున్నాయని, మదమెక్కిన అహంతో పిచ్చికుక్కలా అరిచిన వాణ్ణిమరేమని సంబోధించాలి?

ఇంతకీ చూస్తుంటే శ్రీరామచంద్రమూర్తిగారు, చైనా ఏజంటువర్గమని, పాకిస్తాన్‌పక్షపాతియనిపిస్తూవుంది. ఉత్తమ రచనల్ని, వాడ వాడలా, జాతిని ఉత్తేజపరచ వలసిన ఉత్తమ రచనల్ని ఈవిధంగా విమర్శించడం క్షంతవ్యంకాదు.

విమర్శకులు కొన్ని పదాలను తెలీకుండా వాడారు. 'గ్రంధస్థం శైశవావస్థ'లాంటివి. కొన్ని పుస్తకంలోని పదాలు ప్రమాదాబూతు ప్రయోగం చేసారు. ఉదాహరణకు పుస్తకంలో మనస్తేదం— అని ఉంటే మనస్ఖేదం అని వ్రాశారు. స్మశానం అనేదాన్ని స్మసానం అని వ్రాసారు. ఎత్తి వ్రాయడం కూడా తెలిని వ్యక్తి దూషించడం మరీ విడ్డూరపాలు కావడమే!

ఎం. రామారావు (రాజమండ్రి)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 14—1—'66

విశ్వావసునామ సం॥ పౌష్య మాసం బహుళ అష్టమి

సంపుటము : 58 సంచిక : 20

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 12.25 |


## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయిత గాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేననీ, దేనికీ అనుకరణ కాదనీ హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక

# మనలో మాట

**పాఠకులందరికీ సంక్రాంతి శుభాకాంక్షలు!**

* * *

పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధం వల్ల దేశంలో అత్యంత క్లిష్ట పరిస్థితులు ఏర్పడ్డాయి. ఈ పరిస్థితులే వార్తాపత్రికలకి కావలసినంత 'న్యూస్‌ప్రింట్' దొరకక పోవటానికి ముఖ్యకారణం. అందుచేతనే 'ఇండియన్ ఎండ్ ఈస్టర్న్ న్యూస్ పేపర్ సొసయిటీ' కార్యవర్గం న్యూస్‌ప్రింట్ వాడకంలో కొన్ని మార్పులు తీసుకురావాలని నిశ్చయించింది. పేజీల సంఖ్య తగ్గించటం కాని, ముద్రించే ప్రతుల సంఖ్య తగ్గించటంకాని, లేదా రెండూ తగ్గించటంకాని, అవసరమేమోనని ఈ కార్యవర్గం సూచించింది.

అయినప్పటికీ, న్యూస్‌ప్రింట్ మాత్రమేకాక 'వైట్ ప్రింటింగ్' కాగితం కూడా వాడితేకాని పత్రికల ప్రచురణ సాగటం దుష్కరం. వైట్ ప్రింటింగ్ కాగితం వెల న్యూస్‌ప్రింట్ వెలకన్నా సుమారు రెండు రెట్లు ఎక్కువ అవుతుంది. కాబట్టి, ఈ సంచికతో ఆంధ్రసచిత్ర వారపత్రిక వెల 30 పైసల నుంచి 35 పైసలు చేస్తున్నాము. చందారేట్లు కూడా తదనుగుణంగా మారుతాయి. పై పరిస్థితుల దృష్ట్యా సంక్రాంతి సంచికలో 64 పుటలకన్నా ఎక్కువ వెయ్యలేకపోతున్నాము.

* * *

'ఆహారం' వ్యాసం రచయిత ఆహార సమస్యని ప్రత్యేకంగా అనుశీలించిన వారు. ఈ పత్రిక మధ్యపేజీలలోని 'వి. వి.' వ్యాసంలోని అభిప్రాయాలతో అందరూ ఏకీభవించక పోవచ్చును. కాని ఆహారం— ఎప్పటివలె— మన దేశం ఎదుర్కొనే సమస్యలలో ముఖ్యమయినదని అందరూ అంగీకరిస్తారు! ఇటీవల జరుగుతున్న వాదవివాదాల వల్ల ఆహారధాన్యాల ఉత్పత్తి సంఖ్యలు కూడా సరయినవి కావేమోనన్న అనుమానం మనకి కలుగుతుంది. పై వ్యాసంలో ఇటువంటి సంఖ్యలు కొన్ని ఇవ్వకపోవటానికి ఇదే ముఖ్యకారణం!

* *

ఈ సంవత్సరం కూడా 'సినిమా బాలట్' ఒకటి నిర్వహిస్తున్నాము. పాఠకులు కూడా ఎప్పటివలె మాతో సహకరించి దీనిని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'కాఫు.'



రంగవల్లి ఫొటో: మోహనరావు, విజయవాడ

# పెద్దపండుగ సంక్రాంతి

దివాకరుని దివ్య యాత్రలో ప్రధాన ఘట్టాలు నాలుగు—మేష, కటక, తులా, మకర సంక్రమణాలు మార్తాండుడు ఈ మజిలీలు చేరగానే ప్రకృతిదేవి పులకించి వివిధ విలాసాలు చూపుతుంది ఆవిలాసాల సుపరిణత రూపమే సంక్రాంతి

మార్గశిర పుష్యమాసాలకు పెక్కు పైర్లు, కూరగాయలు కాపునకు వచ్చి, పండి ప్రకృతి కలకలలాడుతూ ఉంటుంది. మానవుడు తను చేసిన కృషి ఫలించి సుఖ సంతోషాలు కలిగించే కాలమది ప్రతివారూ పరమశర్మైపోయే కాలమది ఈ సస్య సమృద్ధిని, ప్రకృతి రామణీయకాన్ని చూచే కాబోలు కృష్ణభగవానుడు "మాసానాం మార్గశీర్షోహం" అన్నాడు.

మార్గశిర మాసం సమాప్తినుంచి ఉత్తరాయణం ప్రారంభమవుతుంది. దక్షిణాయనమంతా వానలు, బురదలు, చీకట్లు కనుక చెడు కాలమని, పితృ దేవతల కాలమని, పంటలు పండి, గాదెలునిండే ఉత్తరాయణం మంచి కాలం, దేవతల కాలమని మన పూర్వులు విశ్వసించారు ఆ మంచి కాలం మకర సంక్రమణంతో ప్రారంభమవుతుంది కనుకనే 12 సంక్రాంతులున్నా, మకర సంక్రమణానికి అంత ప్రాధాన్యం.

మకర సంక్రాంతినుండి ప్రకృతిలో ప్రధానమైన మార్పులు కానవస్తాయి చలిగాలి తగ్గుతూ వస్తుంది. పంటలు చేతికి వచ్చి జీవితం నవనవోన్మేషమవుతుంది. కనుకనే మూడు దినాలు మహోత్సాహంతో జరుపుకుంటారు.

సంక్రాంతి పండుగ మూడురోజులు మన ప్రాచీన సంఘజీవిత సంప్రదాయానికి చిహ్నాలే. వీనిలో మొదటిది భోగి. భోగినాడు తెల్లవారుజామున ప్రతి యింటిముందు మంటలు వేస్తారు. పాత వస్తువులన్నిటిని ఈ మంటలో వేసి కాలుస్తారు తర్వాత మంగళాభ్యంగన స్నానమాచరించి, పీడ విరుగడయయినట్లు భావిస్తారు పిదప పులగము—పొంగలి—వండి ఇష్టదేవతలకు నైవేద్యము పెడుతారు సాయంకాలము పిల్లలకు పేరంటముచేసి, పండ్లు, చెరకు ముక్కలు తలంపై పోస్తారు.

రెండవనాడు సంక్రాంతి. ఆనాడు సూర్యుడు ధనుస్సును వదలి మకర రాశిలో

ప్రవేశిస్తాడు. ఈ నాటినుంచి సూర్యుని వేడిమి హెచ్చుతుంది. మకర రాశ్యధిపతి శని. శని వాతప్రధానమైన గ్రహం. ఈవాత దోష పరిహారార్థమే నూనె, నువ్వులు, బెల్లం, గుమ్మడికాయ మొదలయిన వాటిని ఆరగించాలని, దానం చేయాలని మన పూర్వులు నిర్ణయించారు. సజ్జలు, నూవులు మొదలగు ఉష్ణ వీర్యములయిన వస్తువులు పండే ప్రాంతాలలో నూవులు అద్దిన సజ్జ రొట్టెలుచేసి ఆరగిస్తారు. గొంగళ్లు దానం చేయవలెనని, తిలమయ ధేనువును, ఘృతమును దానం చేయాలని ధర్మ శాస్త్రాలు చెబుతున్నాయి. ఇవన్నీ శీతాపనోదన క్రియలని వేరుగా చెప్పనక్కరలేదు. ఈనాడు సాయంకాలం పిన్నలందరూ పెద్దలకు నమస్కారాలు చేయడం విధి. కనుకనే కొన్ని మండలాలలో దీనికి మొక్కుల పండుగ అని పేరు వచ్చింది.

మూడవ రోజు కనుము. ఇది పూర్తిగా రైతుల జీవితానికి సంబంధించింది. వారు తమకు అన్ని విధాల బాసటగా నిలచిన గోవులను, ఎడ్లను గౌరవించే గొప్ప పండుగ ఇది. నిజానికి గోధనమే దేశ ధనం. అందువలనే పెక్కు భాషలలో పశుగణాన్ని ధనమని, సొమ్ములని, సొత్తులని వ్యవహరిస్తారు.

ఈనాడు రైతులు ఉదయాన్నే లేచి పశువులను నీళ్లతో కడిగి, కొట్టాల ముందు పాలుపోసి పొంగళ్లు వండుతారు. పొంగలి పుడికేటప్పుడు "పాల పొంగలి, పసుల పొంగలి" అని కేకలు వేయడం ఆచారం. ఈ పొంగలిని దేవతలకు నైవేద్యం పెట్టి, పొలాలకు వెళ్లి పొంగలి మెతుకులు చల్లుతారు. దీని "పొలి చల్లడం" అంటారు. ఇది రక్తసిక్తాన్న బలి హరణమునకు సంకేతమట.

కనుమునాడు పశువుల సంబరం చెప్ప నక్కరలేదు. ఇవన్నీ మనం వాటిపట్ల కృతజ్ఞత చూపడమే. సాయంకాలం ఎడ్ల పోటీలు, కోడిపందేలు, గొర్రె, పొట్టేళ్ల పందేలు మొదలయిన వినోదాలు, పసుపుల పోటీలు, పశువుల వూరేగింపులూ జరుగుతాయి.

ఇది పంటల పండుగ గనుక, గ్రామాలలో పలువురిని ఆశ్రయించుకొని బ్రతికే వారంతా కళ్లాలముందు కాచుకునివుండి, గింజలు సంపాదించుకుంటారు. గంగిరెద్దుల వారు మొదలయిన వృత్తులవారు ఇలాటి వారే.

కనుముతర్వాత మరునటిరోజున ముక్కనుము అనే మరొక పండుగకూడ కొన్నిచోట్ల జరుపుతారు. గొబ్బి గౌరీవ్రతము, కాకి పిడచ అని స్త్రీలు పలువ్రతాలు చేస్తారు.

భోగినాడు పొంగలి వండడానికి ధనుర్మాసమంతా పొంగలి ఆరగించడానికి, దేవాలయాలలో పొంగలి వినియోగానికి కారణం వైద్య శాస్త్రాదేశ మనుకుంటాము. వైద్య గ్రంథాలు ఆయా ఋతువులలో అనుసరించవలసిన ఆహార నియమాలు చెప్పాయి. చలికాలంలో రాత్రిళ్లు పెద్దవి, పగళ్లు చిన్నవి గనుక నిద్రలేవగానే ఆకలి పీడిస్తుందిగనుక, స్వస్థులు ముద్గాన్నం సేవించాలని వైద్య గ్రంథాలు చెప్పాయి. ఈ చలి కాలమంతా ముద్గాన్నం సేవించడమంటే శ్రీమంతులు, రాజులు మాత్రమే చేయగలరు. రాజులు తమ వైభవాన్ని భగవత్కైంకర్యభావంతో చేసేవారు గనుక పొంగలి భోగ వినియోగాలు దేవాలయాలలో ఏర్పడ్డాయి.

ప్రాచీన సాహిత్యంలో సంక్రాంతిని గురించిన ప్రస్తావన చేసినవాడు సోమనాధుడు. పిదప శ్రీనాధుడు దీనిని పెనుపండువు అన్నాడు.

మకరరాశి జలచర స్థల చర ద్వంద్వ రూపమని మన గ్రంథాలు చెబుతున్నాయి. గ్రీకులు దీనికి పూర్వ కాయం మేక రూపము, అధఃకాయం చేప అని అన్నారు. ఈజిప్టు ప్రాచీన గాధలలోను ఇది మకర మేష, మీన రూపాల వింత జంతువుగా వర్ణితమైంది.

సంక్రాంతి పండుగ సూర్యగతికి సంబంధించిన, సూర్యారాధన పరమైన పండుగ.

సూర్యుడు ఆరునెలల చీకటిని, వానను వదలి వెలుగుకు, వేడికి వెళ్లుతున్నాడనే దానికి మన పెద్దల సూచన యిది. వైష్ణవ దేవాలయాలలో వైకుంఠ ఏకాదశినాడు జరిగే వైకుంఠ ద్వార దర్శనం సూర్యుని ఉత్తరాయణ ప్రవేశానికి మరొక సూచన. వేదకాలపు సూర్యుడు క్రమంగా విష్ణువయ్యాడు. ఆ విష్ణు దేవాలయాల్లో వైకుంఠ ద్వార ప్రవేశం సూర్యుని ఉత్తరాయణ ప్రవేశమే

—టి. ఆర్.



సంక్రాంతి ముచ్చట — ఫొటో: ఎస్. రామకృష్ణ


ఏం భయపడకు! నీవు చెప్పేవదంతా అర్థమయిందిలే,
రష్యాకు
జంట నాలుకలు
ఏం ఫర్వాలేదు! నాకంతా తెలుసులే!


బక్షీపై ఆరోపణలు
కాశ్మీర్ హైకోర్టు తీర్పు
బక్షీ
తాత్కాలిక రక్షణ


సిలోన్ ప్రభుత్వం
చైనా ప్రవేశం
గురి తప్పిన బాణం


ఆర్థిక మంత్రిత్వ శాఖ
ఇలా వచ్చాం ?


ఆర్థిక మంత్రిత్వ శాఖ
ఇలా వెళ్లాం ...!

14—1—66

# అభివృద్ధి ప్రణాళికల అవసరం...?

శ్రీకృష్ణ

"జీవితానికి ఒక ధర్మం ఉంటుంది. దాని నిర్మాణం అతి సూక్ష్మంగా కొనసాగుతూ ఉంటుంది. నాశనానికి కారణమయ్యే అన్ని విధానాలూ అవి నాశనం చెయ్యాలని చూసేవాటిలోని 'ఎంట్రోపీ'ని అధికం చేస్తాయని గణిత శాస్త్రవేత్తలూ, భౌతికశాస్త్రవేత్తలూ చెప్తారు. ఒక వస్తువులోని అల్లకల్లోలమే దాని 'ఎంట్రోపీ'ని తెలుపుతుందని స్థూలంగా చెప్పవచ్చు. నిలకడని సంరక్షించుకుంటూ, కల్లోలాన్ని ఎదిరించే శక్తివల్లనే ప్రాణం నిలవగలుగుతుందని కూడా చెప్పవచ్చు" అన్నారు ఇటీవలే ఆరోగ్యశాఖమంత్రి డా. సుశీలా నయ్యర్, ఒక సమావేశాన్ని ఆవిష్కరిస్తూ. ఈ సమావేశాన్ని "ది సొసయిటీ ఆఫ్ బయోలాజికల్ కెమిస్ట్స్ ఆఫ్ ఇండియా" వారు ఏర్పరచారు.

ఒక కాంగ్రెసు మంత్రి ఇలా మాట్లాడటం సంతోషించతగ్గ విషయమే! 1947లో అధికారానికి వచ్చిన కాంగ్రెసు ప్రభుత్వం జాతి, కుల భేదాలులేని సమాజం స్థాపిస్తానన్నది. నిజానికి కులభేదాలని పెంపొందించింది. మతాభిమానాలు మరింత గాఢంగా ఉన్నాయి నేడు. 'వి. ఐ. పి.' (అతి ముఖ్య వ్యక్తులు!) అనే కొత్త కులం కూడా సృష్టించింది. పెట్టుబడిదారుల పరపతి ఏమాత్రమూ తగ్గలేదు. హైందవ సమాజానికి శ్రీమతి నయ్యర్ చెప్పిన స్వయంరక్షణ శక్తి ఉందంటే అతిశయోక్తి లేదు.

హైందవ సంస్కృతిలో 'కర్మ' కి ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఈ జన్మలో కాకపోతే పరలోక జన్మలోనయినా చేసిన కర్మఫలం అనుభవించవలసిందేటు. అందుకనే మన సమాజంలో ఇతరుల కష్టాలని తేలికగా స్వీకరించగలుగుతున్నాము. తగినంత పురోగమనం సాధించలేకపోతున్నాము.

కాని శ్రీమతి సుశీలానయ్యర్ హైందవ సమాజ నిర్మాణం కాకుండా శాంతి భద్రతలని గురించి పై విధంగా చెప్పివుంటే ఆమె పొరబడిందనే అనాలి.

ఎందుకంటే, కాంగ్రెసు పార్టీ దేశంలోని సంస్థ లెన్నిటినో నాశనం చేసింది.

ఒకటి, ఆంగ్లభాష—ఈ దేశాన్ని నిజంగా సమైక్యంగా ఉంచిన సంస్థలలో ఒకటి.

రెండు, పరిపాలనా పద్ధతి; ప్రజాస్వామ్యం పేర, ఎంతోకాలంగా సవ్యంగా జరుగుతున్న పరిపాలనా పద్ధతులని రూపుమాపింది.

ఒక్క రక్షణ శాఖని మాత్రం వదిలిపెట్టింది. అందుకనే ఈ శాఖ అవసరమయినప్పుడు దేశాన్ని రక్షించగలిగింది.

ఈ సందర్భంలో నగర ప్రదేశాల అభివృద్ధి ప్రణాళికని గురించి కూడా చెప్పాలి. ఈ ప్రణాళికని ఆరోగ్యశాఖవారు ఆవిష్కరిస్తున్నారు.

వీరి ధ్యేయాలు—

1. ఇరుగు పొరుగువారి సమైక్య భావాన్ని పెంపొందించి జాతీయ సమైక్యతని బలపరచటం
2. నగర ప్రాంతాలవారిని సామాజిక వ్యవహారాలలో వీలయినంత దాకా పాల్గొనేటట్లు చేసి, స్వశక్తి, అన్యోన్య సహకారాల ద్వారా అభివృద్ధి సాధించటం.
3. నాగరిక భావాలని పెంపొందించి జీవిత పద్ధతులలో మార్పులు తెప్పించటం.
4. ప్రాంతీయంగా నాయకత్వాన్ని ప్రోత్సహించటం.
5. సాంకేతిక నైపుణ్యాలని వీలయినంతగా వినియోగించటం, ప్రజలకి నేర్పటం.

నేటి అత్యవసర పరిస్థితినిబట్టి ఈ ప్రణాళికని రక్షణకి వినియోగించాలని చూస్తున్నారు. అంటే, ధరలు మారకుండా ఉండేట్లు చూడటం, సహకార సంస్థలని ప్రోత్సహించటం, పొదుపు ఉద్యమాలని బలపరచటం, ఆహార వస్తువులు దండగచెయ్యకుండా ఉండేట్లు చూడటం వగైరా అన్నమాట.

ప్రతి మున్సిపాలిటీ, లేక కార్పొరేషన్ ఆ ప్రాంతంలో పై ప్రణాళిక అమలుకి వచ్చేట్లు చూడటానికి ప్రయత్నిస్తుంది. ప్రాంతీయాధికారవర్గాలు 'ప్రాజెక్ట్ ఎడ్వయిజరీ (సలహా) కమిటీ'ని ఏర్పరుస్తారు. ప్రతి కమిటీకి మున్సిపల్ లేక ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ కార్యదర్శిగా ఉంటాడు. అధ్యక్షుడుగా మేయర్‌గాని, ప్రెసిడెంట్‌గాని ఉంటాడు.

ఒక ప్రణాళిక 50-60వేల మందికి వర్తిస్తుంది. ప్రతి ప్రణాళికకీ ఒక ప్రాజెక్ట్ ఆఫీసర్, 8 కమ్యూనిటీ ఆర్గనైజర్లు (4 ఆడ, 4 మగ) ఉంటారు. వీలయినంత దాకా ప్రాంతీయ వర్గాలవారినే వినియోగిస్తారు.

ప్రాజెక్టులకింద ఆరోగ్యానికి, నగరవాస

## చరిత్ర పరుగులు తీస్తోంది...!

ఆర్థికమంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి డిసెంబరు 31 వ తేదీన రాజీనామా చేశారు.

ఆర్థికమంత్రులు రాజీనామాలు చేయుటం భారతదేశ రాజకీయ చరిత్రకు కొత్త కాదు. లోగడ ఆరు సందర్భాలలో ఆర్థికమంత్రులు రాజీనామాలు చేశారు.

చరిత్ర పరుగులు తీయుటం అంటే యిదే కాబోలు!



నిక, సాంస్కృతిక వ్యాయామ కార్యక్రమాలకి సంబంధించిన వాటిని ఎన్నుకుంటారు. ప్రజలలోనే అభివృద్ధి కావాలనే అభిలాష

## న్యూఢిల్లీ లేఖ

కలగాలిట.

మొదటి మూడు సంవత్సరాల ఖర్చులో సగం కేంద్ర ప్రభుత్వం, సగం రాష్ట్ర ప్రభుత్వాలు భరిస్తాయి. రాష్ట్ర ప్రభుత్వం తిరిగి ప్రాంతీయాధికార వర్గాల సహాయం తీసుకుంటుంది. ఇంతదాకా 15 ప్రాజెక్టుల వివరాలు వెలువడ్డాయి. ఇవి ఈ సంవత్సరంలో ప్రారంభం అయ్యేవి.

గ్రామ ప్రాంతాల అభివృద్ధి ప్రణాళికల విజయం ఎంత ఘనంగా ఉన్నదంటే మనం ఇంకా ఆహారంకోసం విదేశాలలో ముష్టి ఎత్తుకోవలసివస్తోంది. కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ఉద్యోగులు కాంగ్రెస్ పార్టీ ఎన్నికలలో తమకి ప్రచారం చేస్తున్నారని పార్టీ నాయకులు నమ్ముతున్నారు.

ఇక నగర ప్రాంతాలలో ప్రణాళిక 'ఉద్యోగులు' సాధించగలిగింది ఏమిటి? ఒక చిన్న ఉదాహరణ ఇస్తాను. ప్రతి ఉదయం న్యూఢిల్లీ రోడ్లని కొందరు వచ్చి వూడుస్తారు. వూడవగా వచ్చిన చెత్తని డ్రెయినేజిలో పడేస్తారు. ఈ డ్రెయినేజిలని శుభ్రం చేసినప్పుడు చెత్తా చెదారాలన్నీ మళ్ళీ రోడ్లమీదకే వస్తాయి. ఈ విషయములో ఎంతో అభివృద్ధి అవసరం. అంతదాకా ఎందుకు? అసలు ఆరోగ్యశాఖ భవనాలలోనే ఎంతో సంస్కరణకీ, అభివృద్ధికీ అవకాశం ఉంది. బ్రిటీషువారి రోజుల్లో 'సెక్రటేరియట్' భవనాలు చక్కగా ఉండేవి. నేడు, అవి మురికివాడలయిపోయాయి. ఖద్దరు పుణ్యమా అని బంట్రోతులందరూ వికారంగా కనిపిస్తారు. తక్కువ శాఖలు కొన్నిటిలో కూడా ఇదే వరస.

'గవర్నమెంట్ ఎస్టేట్' లో పరిశుభ్రత సంపాదించేందుకని ఒక 'ఎడిషనల్ ఎంజనీర్' ఉన్నాడు. ఆయనకింద ఎందరో ఉద్యోగులు పని చేస్తారు. పరిశుభ్రతా పరికరాలు ఎన్నో కొంటారు. కాని చివరికి కిటికీల అద్దాలు కూడా శుభ్రంగా ఉండవు.

అభివృద్ధి ప్రణాళికలు ప్రభుత్వ కార్యాలయాలలోనే ప్రారంభం అయితే మంచిది.
















# సోమవారి మహాత్మ్యం

Jayadev...























వాకాటి పాండురంగారావు

# బ్రతుకన్నది ఒకవారం

రాత్రి— ధీరుడి మహామహుని నిశ్చలంగా వుంది. వెన్నెల మవునంగా కాస్తున్నది.

అయిదువందల గజాల తోటమధ్య బంగళాలో మూల పడగ్గదిలో చీకటి వున్నది కాని దాని అధికారాన్ని సవాలుచేస్తూ దీపం చిన్నబుడ్డి వున్నది.

ఖరీదయిన తివాచీపై ఎడల్పాటి మంచంపైనున్న మెత్తటి పడకపైన తల్లి గర్భంలో శిశువువలె ముడుక్కుని పడుకుని వున్నాడు వెంకటకృష్ణయ్యగారు.

మంచం తలవైపు గూటిలో వున్న బుద్ధుడి చూపులలోనే బాధలన్నీ కరిగి పోతాయి. అవతల షెల్ఫులో నానా రకాల పుస్తకాలూ పత్రికలూ సహజీవి స్తున్నాయి. పై పుస్తకాల వరసమీద ఒకగడియారం— నీలం రంగుది— మనిషి మేధస్సుమీద యంత్రపు అధికారంలా కూచునివున్నది. గంట రెండున్నర అని ముచ్చటగా చెబుతున్నది.

కిటికీలో ఇరుక్కున్న 'కూలర్'— ఆగదికీ, బయటి ఉక్కపోతకూ మధ్య డబ్బు పెట్టిన గోడలావుంది.

కృష్ణయ్య ఇటు పొర్లాడు. ఆయన తల వెంట్రుకలు తళుక్కుమన్నాయి. అది చూచే కాబోలు ఆయన కాళ్లవైపు గోడ మీద పెద్ద కేలండర్‌లో సినిమా తార నవ్వుతూంది.

చీకటిలో వెలుగులాగ, మిథ్య మధ్య నిజంలాగా— గాఢనిద్రలోని ఒకవిధమైన మెలుకువలో వున్నాడు కృష్ణయ్య. మూసు కునివున్న కళ్ల తెరపై అంతరంగం ఏదేదో దృశ్యాల్ని ఆడిస్తున్నది. చూస్తున్నది అర్థమయినట్లేవుంది. అంకెలన్నిటిని మరి చినా అంకెల వెనక అంకాలను మరవలేదు మనసు.

ఆ నిద్రలో— ఆమెలకువలో ఒకశిశువు యాభై గంటలుమాత్రం ఈభూమ్మీది గాలిని పీల్చినవాడు కేరు మన్నాడు.

కృష్ణయ్య నిద్ర ఇంచుమించు హత్య కావింపబడింది. కాని కాలేదు. దుప్పటిలాగి కప్పుకున్నాడాయన.

రాజ్యం చివరిసారి అనారోగ్యంతో ఆర్నెల్లు ఆస్పత్రిలో వుండగా— ఇదేగదిలో ఆ బుధవారం సంజెవేళ ఆ షెల్ఫు ప్రక్కన కూచుని పత్రికేదో తిరగవేస్తుంటే—కుర్చీ లేవోలోపలికి తీసుకొచ్చి అమర్చడానికి ఎల్లమ్మ వస్తే— పత్రికమీదుగా తన కళ్లటు మళ్లితే — పనిచేసుకుంటున్న ముప్ఫై యేళ్ల ఎల్లమ్మ వంటిమీది వంపులన్నీ గుండ్రటి అక్షరాలై, ఆఅక్ష రాలన్నీ కలిసి చీకటికి ఆహ్వానంగా అనిపిస్తే ట్యూబ్‌లైట్ వెలుతురుండి కూడా లేన ట్లయితే—వలభై యేడేళ్ల జీవితపు నిగ్రహ ముండి కూడా లేకపోతే—నరాలన్నీ బిగుసుకు పోతే—పత్రిక ప్రక్కకు పడిపోతే—అదిరిపడి వెనక్కు తిరిగిన ఆ కళ్లల్లోని ప్రశ్నా భయమూ చూసి కూడా చూడక కళ్ల కడ్డంగా కళ్లు చేర్చిన ఆ క్షణం—

మళ్లీ మళ్లీ ఆ క్షణాన్నే, రాజ్యం ఇంటి కొచ్చేలోగా, ఎన్నిసార్లు గుణించాడో తెలి యదుగాని—

రెండు నెలల తర్వాత ఎల్లమ్మ ఒక కారుణ సత్యాన్ని చెప్పినపుడుమాత్రం గుండె ఘల్లుమన్నట్లయింది. ఛీ—ఆ విధవ కడుపున తన బిడ్డ! అసహ్యం వేసింది.

రాజ్యం వచ్చేలోగా దానికి అయిదువందలిచ్చి పంపేశాడు.

తర్వాత ఒక సంవత్సరానికి—అప్పటికి రాజ్యంపోయి రెండు నెలలయింది. మళ్లీ వచ్చింది ఎల్లమ్మ.

మందు లేమీ పనిచేయలేదట. ఆబిడ్డను కన్నదట. రెండు రోజుల తర్వాత చనిపోయిందట. నిజమేనా......కాదు......కాదు.... ఈ మనిషి......

మళ్లీ అయిదు వందలిచ్చి కృష్ణయ్య తాత్కాలికంగా మనశ్శాంతిని కొనుక్కున్నాడు. కృష్ణయ్య కాళ్లు జాచుకుని మంచం కొసకు జరిగాడు. ఆయన తలక్రింది దిండు గలేబు మీద రెండు రామ చిలుకలూ ఎప్పటిలాగే ముచ్చట లాడుకుంటున్నాయి. గడియారంలో పెద్దముల్లు ఏడంకెతో పరాచికాలాడ నారంభించింది......

గలగలలాడే నీరునిండిన ఏరు...ఆనీటిలో తన రంగు బాగుందా లేదా అని కాబోలు చూచుకుంటూంది ఆకాశం. గట్టుమీది గడ్డి మొక్కలు అవునౌనని తలలూపుతున్నాయి. ఇవతలి పొలంలో వరిపైరు సైనికుల బారుల్లా నిలిచివుంది......గభుక్కున ఏటి నీరంతా ఎర్రగా అయింది......నీరూ,పైరూ ఆకాశమూ అన్నీ ఎగిరిపోయాయి. ఏరంత వెత్తుటిమధ్య ఎర్రటి పడవలా రక్తసిక్తమయిన తలతో పడిఉన్నాడు......ఎవడు ? అతడు.....అతడు.....?

ఏటి ఒడ్డునున్న ఆ పొలాన్ని కొని—అక్కడ ప్రకృతి ఒడిలో అందమైన ఇల్లు కట్టుకుని అపుడపుడు మిత్రులకు పెద్దలకు విందు లిచ్చుకుని పైపైకి మెట్లు వేసుకుందామని, కులాసాగా వుందామని అనుకుంటే ఆ రాజారావ్ పొలం అమ్మను పొమ్మన్నాడు. ఎంత గర్వం! తనంతటివాడిని, మాటకు ఎదురెరుగని వాడిని—నాలుగువేలకు బదులు ఇరవైవేలిస్తానన్న వాడిని తిరస్కరించాడే, తాత ముత్తాతలనాటి పొలాన్ని ఫల్గుణుడే వచ్చినా ఇవ్వనన్నాడే......ఎంత అవమానం!—

సరిగ్గా ఆరు వారాల తర్వాత పోలాయికి రెండు వేలిస్తే పనయిపోయింది. రాజారావు ఘనత వహించిన అతడి తాత ముత్తాతలను చేరుకున్నాక—ఇరవై రోజులు తిరుగకముందే వాళ్లావిడ ఆ పొలాన్ని ఆరువేలకు తన కన్న పుట్టిల్లు చేరుకుంది......

మంచపు ఆ చివరనుండి ఈ చివరకు పొర్లడంలో కృష్ణయ్య నోటిలోని చొంగ కుడి బుగ్గమీదకు కారింది. ఆ తడిగిత నైట్ బల్బ్ వెలుతురులో ఒక భాగాన్ని దాచుకో యత్నించింది. నిద్రలోనే కాళ్లకు దగ్గరగా దిండుకు చేర్చుకున్నాడు కృష్ణయ్య. గడియారం పడకమీద, మూడంకె దిండుమీద, నిముషమాత్రం పెద్ద ముల్లూ చిన్న ముల్లూ గాఢ పరిష్వంగంలో లీనమయ్యాయి.

అంగుళం వెడల్పున్న నల్ల పురుగొకటి ఝుమ్మంటూ ఎగిరివెళ్లి బల్బుమీద పడి ఆ వేడికి ఎగిరి బుద్ధుడి మొహంమీదపడి, అక్కడ పట్టుదొరక్క బుద్ధుడివళ్లో పడింది. బుద్ధుడు ఇంకా నవ్వుతూనే వున్నాడు.

ఏడుస్తున్నట్టు సన్నగా మూలిగాడు కృష్ణయ్య.

ఈడల మర్రిచెట్టుక్రింద మినుకు మినుకు మంటుంటే ఎవరక్కడ అని అరిచాడు తను. జవాబులేదు. చేతిలోని టార్చి వేశాడు. వెలుతురు నాలుకకు ఏమీ అందలేదు. ఆకులు చప్పుడయినట్లయింది. గబగబ చెట్టుక్రిందకు, ఊడల గుబురు మధ్యకునడిచి టార్చిని పైకివేసి చూశాడు.

మరుక్షణం—బాబోయ్ కొన్ని వందల చేతులు తనపీకని నొక్కెయ్యసాగాయి.... అరిచాడు...... విదిలించాడు.... కొరికాడు... ఒక్క దూకులో ఇటొచ్చి నేలమీదకు పడ్డాడు. టార్చి చేతినుండి ఎగిరిపోయింది. కాని పెద్ద మెరుపులాటి వెలుతురు దానితో బాటే, హహ అని నవ్వు!! అదుగో ఆ ఊడ లుండినచోట్ల విశ్వనాథం, ఆయన పెళ్లాము ....కొడుకు లిద్దరూ!.....

చదువులేని తాను పల్లె విడిచి, పట్నంచేరి రోడ్ల వెంబడి తిరుగుతుంటే ఉద్యోగం ఇప్పించాడు విశ్వనాథం. ఆ ఉద్యోగం సరిపడక తను వ్యాపారం పెడతానంటే నోటు కూడా రాయించుకోకుండా ఆరువేలిచ్చాడు విశ్వనాథం. అయిదేళ్లలో తన బట్టల వ్యాపారం పదివేల నిచ్చింది. విశ్వనాథంగారి రోజులు చెడ్డాయి. ఉద్యోగం చేస్తున్న కంపెనీ మూశారు. తన దుకాణంలో చేరనన్నాడు. ఆయన కొడుకు లిద్దరూ డబ్బులేక స్కూలు ఫైనలు కూడా చదవలేకపోయారు. ఆయన పెళ్లాం మెడలో పసుపుదారం నిలిచింది. తన్నడిగాడు ఆ డబ్బిమ్మని! ఆరు వేల రూపాయలు!—నోటు కూడా లేదు. ఈ పిచ్చి బ్రాహ్మడేం చేస్తాడులే అని తప్పుడోయాల్లి ఇప్పుడొక వందా ఇచ్చాడు. చివరకు ఒక నాడు చిరిగిన చొక్కాతో, నలిగిన కాగితంతో వచ్చాడు విశ్వనాథం. వడ్డీతో సహా లెక్కవేస్తే ఎనిమిదివేలా ఎంతో అయిందిట. తానిచ్చిందిపోగా, ఇంకా ఏడువేల వంద వుందిట. తనకు నవ్వొచ్చింది. "అయ్యగారూ! కాగితమూ పాడు లేకుండా ఏడు వేలు ఎందుకు ఇవ్వాలయ్యా" అన్నాడు తను నవ్వుతూ. గిరుక్కున వెనక్కు వెళ్లిపోయాడు విశ్వనాథం.

మరురోజు పొద్దున రాజ్యం నిద్రలేపి చెప్పింది. ఆ కుటుంబంలో నలుగురూ ఉరి పోసుకు చచ్చిపోయారుట!

మెడమీద గోక్కుంటున్న కృష్ణయ్య చేతికి నల్ల పురుగు దొరికింది. ఉలిక్కిపడి లేచాడు ఆయన. ఆ పురుగును విసిరి పారేశాడు. భయం భయంగా గదివంతా కలయజూశాడు.

తనింతసేపూవున్న నరకం ఏమయింది? అదంతా నిద్రేనా—కాదు....తన జీవితపు సినిమాకు నెగెటివ్ అది.....పదవి, పేరు, డబ్బు, నాయకత్వంవంటి నవరత్నాలు గుచ్చిన హారం నిజానికి ఎముకల మాలగా తెలియ వచ్చింది. ఎంత భయంకరం......

రాజ్యం వల్లగా దాటుకుని అయిదేళ్లయింది. అదివున్నంతకాలం— రోగం, రోగం, స్పెషలిస్టులు, మందులు, రోగం!

పెళ్లయి నాలుగయిదేళ్లు హాయిగా వున్నారేమో! అంతే! తమ ఆనందపు ఉదయం అది. అప్పటి కిరణం అబ్బాయి భాస్కరం.

అబ్బాయి!

రాజ్యం పోనేపోయింది. అబ్బాయి—వుండీ లేనట్లే....

గభుక్కున దిండులోకి ముఖం దాచుకున్నాడు కృష్ణయ్య. టేబిలుమీది రామ చిలుకలు వెచ్చటి నీళ్లలో స్నానంచేస్తుంటే బుద్ధుడు ప్రశాంతంగా చూస్తున్నాడు. గడియారం అయిదు కొట్టనా అని అడుగుతూంది. అడిగి అడిగి విసుగెత్తి అయిదు అయిందని అలారం గొంతుతో అరిచింది.

దిండుకు దూరమయిన కృష్ణయ్య కళ్లకు తలుపు ప్రక్కన టేబిలుమీదవున్న కొడుకు ఫోటో కనుపించింది. ఆయనలేచి ట్యూబు లైట్ వేశాడు. టేబుల్‌మీద ఫోటో ప్రక్కన కప్పు ఆకారంలోవున్న పేపర్ వెయిట్‌ని ప్రక్కకుంచాడు. దాని క్రిందవుంది

# బ్రతుకన్నది ఒకవరం

బొంబాయినుండి నిన్న సాయంకాలం వచ్చిన నాలుగు పేజీల ఉత్తరం.

"....డబ్బు మనిషినేమిచేస్తుందో అతడి చేత ఏమేమి చేయిస్తుందో తెలుసుకున్నాను. కనుక మీ ఆస్తి నాకు రాకపోవడమే మంచిది. నేనూ మేరీ మాకు కావలసింది సంపాదించుకో గలము. ఒండొరులపై విశ్వాసంతో, జీవితం మీద పూర్తి నమ్మకంతో మొదటి అడుగువేస్తున్న మా భవిష్యత్తు అనే పలక మీద నీడలులేకపోవడం మంచిదే.

—భాస్కరం."

—'భా' మీద కన్నీటిచుక్కపడి చెదిరింది. కళ్లనీళ్లను వేలితో తుడిచినకృష్ణయ్య పెద్ద బీరువా తాళం తెరిచి గుడ్డ మడతల వెనకవున్న రివాల్వర్‌ని తీసిచూశాడు. దీపం వెలుగులో రివాల్వర్ తాచుపామువలె మెరిసింది.

మంచంమీదకువెళ్లి కూచున్నాడు కృష్ణయ్య. చుట్టుప్రక్కల తేరిపారచూశాడు ఒక్కక్షణం ఆయన కళ్లల్లో విముక్తి తళుక్కుమంది.....

మరుక్షణం రివాల్వర్‌ని పరుపుమీదపారేశాడు.

ఇదేమి పిరికితనం? ఒప్పని నమ్మినది తప్పని తెలిస్తే పారిపోవడమా? ప్రేయసి అని కౌగలించుకున్నది అస్థిపంజరమయితే ఆత్మహత్యకు పాల్పడడమా?

మనిషి కన్ను మూయవచ్చు. చట్టం నోటికి తాళం వేయవచ్చు. ఇవి సులభమే. కాని—

కానీ, తనకు ఇన్ని రోజులుగా తెలియని కన్నొకటి తన్ను చూస్తున్నది. తను వినని గొంతొక్కటి మౌనంగా ఘోషిస్తున్నది. అందుకని ఇప్పుడు కన్నూ చెవీ శాశ్వతంగా మూసేసుకోవడమా—ఊహూ!

వెనకటి జీవితపు ప్రతి అడుగులో తాను చేసిన ఒక్కొక్క నేరానికీ ఒక్కొక్క శిక్ష అనుభవించాలి. నిప్పుల మీద నడిచి మళ్లీ మనిషి కావాలి. మొసళ్లున్న నదిలో ఈది ఇవతలకు రావాలి. అప్పుడూ తానొక వ్యక్తి! చూడరానిది, అయినా అనుక్షణమూ చూస్తూవుండేది అయిన, ఆ కంటి ఎదుట నిలబడాలి. వినరానిది అయినా నిరంతరం మాటలాడేది అయిన ఆ స్వరాన్ని కులాసాగా పలకరించాలి. అదీ బ్రతుకంటే! తానూ బ్రతకాలి.

—మంచంమీదనుండి లేచాడుకృష్ణయ్య. లేచి గది కిటికీ తలుపులు తెరిచాడు. ఆకాశం పిరికిపందలా పారిపోతున్న చీకటినిచూసి కాబోలు—కండ్లెర్ర చేస్తున్నది. వెలుగు రాకతో దారులు తెలిసిన పక్షులు ఆకాశపు స్వేచ్ఛలోకి ఎగిరిపోతున్నాయి.

.....అయిదారుగంటల తర్వాత కృష్ణయ్య కలెక్టరాఫీసు భవనంలో మేడమీద పెద్ద గదిలో కలెక్టర్ ధర్మారావు ఎదుట ఆసీనుడయ్యాడు.

"నమస్కారమండీ.....చాల రోజులయింది కలుసుకుని.....మొన్న హైదరాబాదు నుండి సెక్రటరీ.....గారు ఫోనుమీద మాట్లాడుతూ మీరటువైపు రావడం లేదేమని అడిగారు కూడా—" అన్నాడు ధర్మారావు.

తల వూపాడు కృష్ణయ్య. బంట్రోతు రెండు కప్పులతో కాఫీ తెచ్చిపెట్టాడు. లాంఛనానికి ఎంగిలిచేసి కాఫీకప్పుని క్రిందపెట్టి పెద్దగా నవ్వాడు.

"అబ్బే, ఏమీలేదు. నేను మీతో కొన్ని విషయాలు చెప్పదలచుకున్నాను. అవి విన్న తర్వాత మీరు నాకు ఇట్లాగే కాఫీ ఇవ్వగలరా అనిపించింది."

"నాకేమీ బోధపడడంలేదు." అన్నాడు ధర్మారావు.

చేతి గడియారం చూసుకున్నాడు కృష్ణయ్య. పదకొండూ ఇరవై అయింది.

"ధర్మారావుగారూ, వినండి!"—అని మొదలెట్టి తన గుండెమీద మండుతున్న నిప్పులను, తన మనసున ఆడిన పాముల పడగలను పదాలుగామార్చి ధర్మారావు ఎదుట వుంచాడు కృష్ణయ్య. ఒక పరాయి స్త్రీ శీలం, ఒక శిశువు ప్రాణం, మరొక రైతు హత్య, ఇంకొక కుటుంబపు ఆత్మహత్య—ఇవిగాక హోట్లకోసం పర్మిట్లకోసం తను వేసుకున్న లంచాల వంతెనలు, మంచాల నిచ్చెనలు—అన్నిటినీ గబగబ చెప్పాడు కృష్ణయ్య.

"ఇపుడేమంటారు ధర్మారావ్! ఈ బురఖా చింపండి. ఈ బూటకాన్ని బయట పెట్టండి. నన్ను అరెస్టు చేయించండి..."

ఈ ప్రపంచాన్నే తన అరచేతివలె ఎరిగిన వాడిలా నవ్వాడు ధర్మారావు. నిదానంగా పలికాడు. "అయ్యా, కృష్ణయ్యగారూ, నాకు ఆశ్చర్యం వేస్తున్నది. చాల ఆశ్చర్యం వేస్తున్నది. ఎందుకో తెలుసా? మీరు చెప్పినవన్నీ చేసినందుకుకాదు. చేసినవన్నీ చెప్పినందుకు... మీరు చేసినవన్నీ అతి సహజమైనవి....పైకి రావడానికి చాల అవసరమయినవి. అదొక

(53వ పేజీ చూడండి)

Prestige



పాత పద్ధతిలో వంటచేస్తూ, ఆమె ఎప్పుడూ వంటయింటిని అంటిపెట్టుకొని వుంటుంది



ప్రెస్టీజ్‌తో ఈమె నిమిషాలమీద వంటంతా పూర్తి చేస్తుంది.
కావలసినంత వ్యవధి వుండడంచేత ఏదయినా ఉపయోగమయిన, పనిచేసుకొంటుంది.

# ప్రెస్టీజ్ వల్ల బోలెడు తీరిక లభిస్తుంది

ప్రెస్టీజ్‌లో ఒత్తిడికల్గిన ఆవిరివల్ల క్షణాలమీద వంట చక్కగా అవుతుంది. ఖర్చు, కాలం కూడా చాలా కలిసివస్తుంది. 12 ఏండ్ల బాలికలుకూడా దీనితో సులభంగా నిర్భయంగా వంట చేయవచ్చు ■ ఇల్లు ముచ్చటగా వుంచుకోవాలనే యిల్లాళ్ళకు ప్రెస్టీజ్ వరప్రసాదం వంటిది. 300,000 మందికి పైగా గృహిణులు ప్రెస్టీజ్‌వల్ల లాభిస్తున్నారు. మీరుకూడా ఒకటి కొనుక్కోండి.

ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ యావజ్జీవం పనిచేస్తుంది.

ప్రెస్టీజ్ మూడు రకాలలో వస్తూంది.




తయారుచేయువారు : టి.టి. (ప్రైవేట్) లిమిటెడ్. ప్రెస్టీజ్ గ్రూప్ లిమిటెడ్, లండన్ వారి అనుమతితో

సీరియల్

# కరుణ









కొండముది శ్రీరామచంద్రమూర్తి

**జ రి గి న క థ**

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోబాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్దచేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథను జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు. పరీక్షలూ, చదువులూ కంటే, నాటకాలే మన్మథ నెక్కువగా ఆకర్షిస్తాయి. ప్రసన్న, మన్మథ, కరుణలు బి. ఏ. పరీక్ష ప్యాసవుతారు. ప్రసన్న తనను ప్రేమిస్తున్నాడని తెలిసి ఉప్పొంగిపోతుంది కరుణ. మన్మథకు తన జీవిత గాథ వినిపిస్తాడు చలపతి. చలపతికి మరింత సన్నిహితు డౌతాడు మన్మథ. మన్మథతో కరుణ పెళ్లి విషయం తనే ప్రస్తావిస్తానని మన్మథకు మాట ఇస్తాడు చలపతి. కరుణను ప్రసన్నకు చేసుకోమని జమదగ్ని కోరినాకూడా, కరుణ ప్రసన్నలు ప్రేమించుకున్నందువల్ల ప్రసన్నకే కరుణ భార్య కావాలని పట్టుపడ్తాడు విశ్వనాథం. కరుణను ప్రసన్నకే ఇచ్చి చేయడానికి మన్మథ ఇష్టపడుతాడు.

## 12

ఇంతలో వెనకనుంచి నటేశం గొంతు వినిపించింది. "మాష్టరూ! ఆగండి." జమదగ్ని ఆగి వెనక్కు చూశాడు. ఆ పిలిచిన మనిషి బక్కపలచగా వున్నాడు. కోటేరేసిన ముక్కు కోలమొహంలో అందంగా అమరింది. లావుపాటి పెదవులు. వాటిపైన అతికించినట్లుగా ఫ్రెంచికట్ మీసం. రెండుచెవులకూ ఎర్రరాళ్ల దుద్దులు. నొసటున గంధాక్షతలు. ఆ నటేశం, జమదగ్నిని ఆగమని, "ఎక్కడదాకా వెళ్తున్నారు మీరు?" అని అడిగాడు.

"కాకినాడ." జమదగ్నికి ఆ అపరిచితవ్యక్తి తననంత ఆదరించడం అపూర్వమనిపిస్తున్నది.

జేబులోనుండి డబ్బులు తీస్తూ మళ్లీ ఆయన అడిగాడు. "ఎక్కణ్నుంచివస్తున్నారు?"

"ఏలూరు."

"అరె, మాదీ అదేవూరు! మీరేం చేస్తున్నారక్కడ?"

"హైస్కూల్లో మేష్టరి!"

నటేశం, జమదగ్నిని దగ్గరకు పిల్చి, ప్రక్కనే కూచోపెట్టుకుని అడిగాడు. "ఏ స్కూల్లో?"

జమదగ్ని ఫలానా స్కూల్లో అని పేరు చెప్పాడు. ఆ మాటవిని నటేశం మొహంలోకి ఒక వింతకళ వచ్చింది. "మా అబ్బాయి ఆ స్కూల్లో చదువుతున్నాడు. మీకు తెలుసునా?"

జమదగ్ని నవ్వేడు. "ఆ స్కూల్లో వెయ్యి మంది పిల్లలు చదువుకొంటున్నారు. ఆరు ఫారాలు. ఒక్కొక్క ఫారానికి నాలుగేసి అయిదేసి సెక్షన్లు. అంతమందిలో మీ చిరంజీవి ఎవరో నాకెట్లా తెలుస్తుంది?"

నటేశం తన మెళ్లోవున్న పంటిపేట బంగారు గొలుసు నవరించుకొంటూ కుర్రవాడిపేరు, చదువుతున్నక్లాసు, ఆకారవిశేషాలు వర్ణించి చెప్పింతర్వాత, "అవునవును. ఫోర్త్ ఫారంనుంచి నాకు వర్క్‌వుంది. మా పిల్లవాడూ మీవాడూ ఒకే సెక్షను. ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది." అంటూ జమదగ్నికూడా శృతి కలిపాడు.

వాళ్లిద్దరికీ అట్లా రైల్లో కలిసిన స్నేహం, రైలు ప్రయాణంతోనే అంతం కాలేదు. ఏ సుముహూర్తంలో వాళ్లిద్దరి మాటలూ ఏకమయ్యాయోగాని, పదిహేనేళ్ల నుంచీ మమేకం అన్నంతగా సన్నిహిత మయ్యారు. నటేశం, మద్రాసు ప్రాంతానికి చెంది, కేరళకు వలసవెళ్లి, ఆ తర్వాత బెంగుళూరులో కొంతకాలం వుండి, ఆంధ్రదేశంలో స్థిరపడ్డవాడు.

"ఇన్నిప్రాంతాలు చూసినవాడివి, ఆంధ్ర దేశమే ఎందుకు నచ్చిందయ్యా?" అని అడిగితే, "ఇక్కడి మనుష్యులు అల్పసంతోషులు. అందుకని." అని జవాబు చెబుతాడు.

నటేశానికీ, జమదగ్నికీ వున్న స్నేహం కేవలం మాటలతో, అడపాదడపా ఒకళ్ల ఇంటికి మరొకళ్లు రావటంతో, కాఫీలు పుచ్చుకోవడంతో ఆగిపోయిందికాదు. నటేశం కమీషన్ వ్యాపారం చేసేవాడు. వెండి బంగారాలమీద, తాకట్టుపెట్టుకుని డబ్బు అప్పు ఇచ్చేవాడు. కష్టపడుతున్నట్టుగా కనిపించకుండా, కాలుమీదకాలు వేసుకుని సుఖ జీవనం సాగించేవాడు. జమదగ్ని ప్రొద్దున్నా సాయంత్రం పిల్లలకు పాఠాలూ, పదింటి నుంచి నాలుగున్నరదాకాస్కూల్లోయంత్రంలా పనిచేయడం చూచి, "ఇట్లా సంపాదిస్తే, డబ్బురాదయ్యా!— మహానుభావా!— వస్తే, అదొక నీటిప్రవాహంలాగా రావాలి. సుడిగాలిలాగా రావాలి. ఒక వెయ్యి రూపాయలు కూడబెట్టు. అవి పిల్లల్ని పెడతాయి. ఆ పిల్లల్ని వ్యాపారంలోపెట్టు. అంతా తామరతంపరగా వుంటుంది. నువ్వా పిల్లలు గలవాడివి. ఏదన్నా వుంటే, బ్యాంకిల్లో వుండడంకన్నా, మాలాంటివారిదగ్గర వుంటే దానికిపెరుగుదలా,మీకష్టాలకు తరుగుదలా."

ఆ తర్వాత ఒకటి రెండు వారాలవరకూ జమదగ్నికి నిద్రపట్టలేదు ఆతనికి నిరంతరం ఒకేయావ వుండేది. తను పిల్లలు గలవాడు. కళ్యాణికి మంచి సంబంధం చేయాలంటే ఏ పదివేలన్నా పెట్టాలి. పిల్లల్నిద్దర్నీ కాకపోయినా, ప్రసన్ననైనా పైచదువుకు పంపించాలి. అదీ మళ్లీ ఖర్చుతో కూడూకొన్న వ్యాపారమయ్యె. దీనికంతా డబ్బుకావాలి. అతనికి నటేశం నమ్మకమైన మనిషిగా కనిపించాడు. చలపతి పంపించి తనచేతుల్లో పోసిన డబ్బునంతా, నటేశానికి రూపాయి వడ్డీకొడికి ఇచ్చేశాడు. నటేశంకూడా, ఏమాటకు ఆ మాటే చెప్పుకోవాలి, ఏ సంవత్సరం వడ్డీ ఆ సంవత్సరం ఇచ్చేసేవాడు.

"మీరుఇచ్చిన డబ్బు, ఎప్పుడు మీకు కావాలనిపిస్తే అప్పుడు ఒకటిరెండు గంటలు ముందు, కాకిచేత కబురంపించండి. ముద్ర

ద్దిగా లెక్కకట్టి ముట్టచెబుతాను." చెప్పాడు.

జమదగ్నికి వడ్డీతోనే సరిపోయేది. అసలును ముట్టకుండా వడ్డీ డబ్బుతోనే సంసారానికి ఖర్చులు జరపడం మహాభాగనిపించింది. నటేశం దగ్గరున్న అసలుకు ప్రతియేడూ, ఎంతకొంత చేరుస్తూ వచ్చాడు. దానాదానా శారదాంబ, భోజనాలదగ్గర, నటేశం దివాళా తీసాడన్నమాట చెప్పేసమయానికి ఎట్లా లేదనా, ఒక ఏడెనిమిదివేల రూపాయల సొమ్ము నటేశం దగ్గర జాగ్రత్తచేసి వుంచాడు శారదాంబకుగానీ, చలపతికిగానీ, ఇంట్లో మరెవ్వరికీ ఆ సంగతి తెలియకుండా. తెలిస్తే వద్దంటారేమోనని భయపడ్డాడు. మనిషి దగ్గర దాచుకోవడంకన్నా, బ్యాంకులో దాచుకోవడం మంచిదని సలహా ఇస్తారేమోనని అనుమానించాడు. అంతరాంతరాళాలలో తన దగ్గర ఇంత డబ్బు వుందన్న విషయం చలపతికి తెలిసిపోతుందేమోనని అతని సందేహం. ఇన్ని కారణాలను పురస్కరించుకొని, శారదాంబ, నటేశం విషయం అన్నాల దగ్గర ప్రస్తావించినా, కిమ్మనకుండా వూరుకోవలసివచ్చింది. ఆ తర్వాత కరుణ పెళ్లి వ్యవహారం ఒకటి పరిష్కరించవలసి వచ్చింది. ఇప్పుడు కాస్త తీరిక చిక్కినట్లయింది జమదగ్నికి. అతనికి అప్పటికప్పుడు చేయవలసిన పనులు రెండు కన్పించాయి. కరుణను ప్రసన్నకే చేసుకుంటామని, విశ్వనాధంతో చెప్పి రావడం మొదటిది. నటేశం దగ్గరకు వెళ్లి, బ్యాంకులో అతని డబ్బు ఎంత వుండిపోయింది, మనిషి ఎంత చితికిపోయాడో తెలుసుకోవడం రెండో విషయం. నిజానికి తనకు ప్రస్తుతానికి రెండో విషయమే చాలా ముఖ్యమైంది. పిల్ల పెళ్లి చెయ్యాలనుకొంటున్నాడాయె! మన్మథకూ సంబంధం నిశ్చయం చేసుకున్నాడుకదా! ప్రసన్నను నేపో మాపో ఏ విశాఖపట్నమో, హైదరాబాదో పంపించాలి. ఇదంతా బోలెడు ఖర్చుతో కూడుకొన్న వ్యవహారం. నటేశం దగ్గరనుండి ఎంతో కొంత రాబట్టాలి! మళ్లీ జమదగ్నికి అనిపించింది. 'పాపం! కష్టాల్లో వున్నాడు, ఇయ్యగలడో, లేదో!'

పైన కండువా వేసుకుని, బయలుదేరుతున్న భర్తను చూచి, శారదాంబ అన్నది. "మాసిక వేసిన ఆ చొక్కా ఎందుకండీ? పెట్లో గ్లాస్కో లాల్చీ వేసుకోక."

"ఫర్వాలేదులేవే! వాళ్లు చూసేది, నన్ను గానీ, నేను వేసుకున్న చొక్కాను కాదుగా!"



"చొక్కాలోపలున్న మనిషెంతముఖ్యమో మనిషి వేసుకున్న చొక్కా అంత ముఖ్యం."

శారదాంబ మాట విని, ఉత్తరీయం బుజం నిండుగా, మాసికలుపడ్డ చోట్లు కనబడకుండా, కప్పుకున్నాడు.

"మనసులోవున్న బాధల్నీ, చొక్కాకు పడ్డ మాసికల్నూ దాచుకోలేం సుమండీ!"

"అదెవరో నీలాంటి వాళ్లను గురించి చెప్పినమాట, మాకు గాదు. కొండ విరిగి మీద పడ్డా మేం చలించం."

శారదాంబ వెక్కిరింపుగా అన్నది. "నీడలో వుండి మాట్లాడడం అంత సులభం మరొకటిలేదు."

"అయితే నన్నింకా సరిగా అర్థం చేసుకోలేదు నువ్వు."

"ముప్ఫైఏళ్ల బట్టీ అర్థమైంది చాల్లెండి!" శారదాంబ ఇంట్లోకి వెళ్లబోయింది.

జమదగ్ని గడప దిగుతూ, భార్యతో, "నటేశం ఇంటిదాకా వెళ్తాను. మొన్ననేదో అంటివికదూ?"

శారదాంబ అక్కణ్ణుంచే అన్నది. "అవును. పాపం! వాళ్లకు కొంత ధైర్యం చెప్పి రండి."

జమదగ్ని నటేశం ఇంటికి వెళ్లేసరికి అక్కడ వాతావరణమంతా హృదయ విదారకంగా వుంది. నటేశానికి పాడెకట్లు సవారీ తయారవుతోంది. గోడకు ఆనించి, నటేశం శవానికి స్నానం చేయిస్తున్నారు. కుండలో నిప్పు మండలేక మండుతోంది. ఆ దృశ్యం చూసేసరికి జమదగ్నికి మతిపోయినట్లయింది. 'నిన్న కాక మొన్న కనిపించాడు మనిషి! రాయిలా ఉన్నాడు. ఇంతలో ఇంత దారుణం ఏమిటి? ఇది యదార్థమో, భ్రాంతి జనకమో తెలియలేదు జమదగ్నికి.

అక్కడ మూగిన జనంలోంచి నానా రకాల మాటలూ గుసగుసలూ విన్పిస్తున్నాయి.

"ఆ బ్యాంకే ఈయన ప్రాణాలుతీసింది."

"బ్యాంకే కాదు, ఈమధ్య ఈయన వ్యాపారమూ అంత బావుండలేదు. రెండూ కలిసి ఇట్లా అయ్యాయి."

"పాపం! రెక్కలు రానిపిల్లలు వాళ్లు! ఈ వ్యవహారాలన్నీ వాళ్లేం చక్కపెట్ట

జమదగ్ని చెవులొగ్గ పెట్టుకుని వింటున్నాడు. జమదగ్నిని చూడగానే, కర్మకాండ జరవేరుస్తున్న నటేశం పెద్ద కొడుక్కి, కళ్లనిండా నీళ్లు వచ్చి, "మాష్టారూ! రెక్కలు తెగిన పక్షుల్ని చేసిపోయినాడు మా నాన్న మమ్మల్ని!!" అంటూ భోరున ఏడ్చాడు.

జమదగ్నే అతన్ని ఓదార్చవలసివచ్చింది. ఈ సమయంలో ఏడవకూడదు నాయనా! నీ అభివృద్ధి చూసుకునే అదృష్టం ఆయనకు లేకపోయింది. ఏడవకు! మనస్సుకు ధైర్యం చెప్పుకుని అన్నీ యథావిధిగా చెయ్! ఎక్కడా లోపం చెయ్యకు. ఆయన బహు కర్మిష్టి. పుట్టినవాడు గిట్టక తప్పదుకదా! ఆయన దారి ఆయన చెతుక్కున్నారు."

శవాన్ని పాడెపై పడుకోబెట్టటానికి మనుషులు కావలసివచ్చారు. గుండె ధైర్యం చాలినవాళ్లు కనబడలేదు. జమదగ్ని వైపే ఆ కుర్రవాడు, "మీరూరూరుకోవడం భావ్యమేనా?" అన్నట్లు చూస్తున్నాడు. జమదగ్ని ఆ చూపులో పేదతనానికి తట్టుకోలేకపోయాడు. గబ గబా లేచి, చొక్కా విప్పి, అంగవస్త్రం నడుముకు కట్టుకుని, బావి దగ్గరకువెళ్లి, నెత్తిన ఇన్ని చన్నీళ్లు దిమ్మరించుకుని వచ్చి తనో శవ వాహకుడయ్యాడు. అంతవరకూ తను కలిసి తన వ్యవహారాలు ముచ్చటిద్దామన్న నటేశాన్ని, డబ్బుకూ, జీవితానికీగల సంబంధాన్ని గుర్తించి, దాన్ని సంపాయించుకోవడంకోసమే జీవితమంతా ధారపోసి, చివరకు దాని చేతిలోనే ఓడిపోయిన నటేశాన్ని, శ్మశానానికి, తీసుకువెళ్లి తగలబెట్టేశాడు. శవ దహనంలో కపాలమోక్షం అయి, అందరు స్నానాలుచేసి, ఇంటికివచ్చి దీపారాధన చూసిన తర్వాత, ఇహ జమదగ్ని ఇంటికి పోదాం అనుకొంటుండగా, భోజనం చెయ్యమని బలవంతం చేశాడు నటేశం పెద్ద కొడుకు. "ఇవ్వాళ కాదు నాయనా! పది, పదకొండు, పన్నెండు ఆ మూడు రోజులు తప్పకుండా వస్తాను. నువ్వుమాత్రం ధైర్యంగా వుండు. మనస్సు కష్టపెట్టుకోకు. గతించిన దాన్ని గూర్చి విచారించి ప్రయోజనంలేదు కదా!" అని వెళ్లబోయాడు.

"అయితే ఒక్క క్షణం వుండండి మాష్టారూ! మొన్న సనగా ఈ కవరు మీ కియ్యమని నా నాన్న నా కిచ్చారు. నాకు తీరుబడి కాలేదు. ఇవ్వాళ జరిగింది కదా"

# కరుణ

అంటూ ఓ కవరు తీసుకొనివచ్చి; జమదగ్ని చేతిలో పెట్టాడు ఆ కుర్రవాడు.

జమదగ్ని ఆశ్చర్యంతో ఆ కవరు నందుకున్నప్పుడు అతని చేతులు వణికాయి. చనిపోయినవాడు బతికివుండగా రాసిన ఉత్తరాన్ని, మరో బతుకున్న మనిషి అందుకోవడంలో వున్న కంపనం అది! అతనా ఉత్తరాన్ని తీసుకుని, రోడ్డుమీదకు వచ్చేసేడు. వెనకనుంచి వంద కళ్లు పరిశీలనగా చూస్తున్నాయి.

సాయంకాలపు సిరెండపోయి, చీకటీ, మబ్బూ సయ్యాట లాడుకుంటున్నాయి. నక్షత్రకాంతలు, మబ్బు పరదాల చాటునే ముగ్గిపోతున్నాయి. ఆకాశంలోకి చేతులు చాచిన బాదం కొమ్మలూ, వేపరెమ్మలూ పిచ్చిగా నృత్యం చేస్తున్నాయి. భయం భయంగా గుండె దడదడలాడగా, కవరు చించి లోపలి ఉత్తరాన్ని బయటికి తీశాడు.

పాటబడ్డ ఎక్సర్‌సైజు బుక్కులోని రుళ్లే కాయితంమీద, కంగారు కంగారుగా వ్రాసిన వాక్యాలు "జ. పి. పెట్టేశాను. తప్పలేదు. ఏం చేయమూ? అందరికీ తలో అణా వస్తుందేమో రూపాయికి. నువ్వు పిల్లల గలవాడివి. నీకు ఎట్లా సాయం చెయ్యను? నా దగ్గర ఒక్క వెయ్యి రూపాయలే ఉన్నాయి. అయిదు వందలు నా అపర కర్మకు వుంచుకొంటున్నాను. నన్ను తగలపెట్టడానికి నా పిల్లలు యాచిస్తుండం నాకు ఇష్టం లేదు. మిగిలిన అయిదు వందలూ నీకు పంపిస్తున్నాను. ఇదీ, అందరితోపాటుగా రేపు కోర్టులో పుచ్చుకొనేది కలిపితే, వోవెయ్యి దాటుతుంది. అంటే రూపాయికి పావలా అన్నా నీకు గిట్టుబాటు అయిందన్నమాట. అదృష్టవంతులు! ఈ దురదృష్టవంతుణ్ణి మర్చిపోకండి". ఉత్తరం చదవగానే కళ్లల్లో రక్తపు చుక్కలే కరువయ్యాయి జమదగ్నికి. నటేశం మనస్తత్వం అతన్ని ఉగ్రూపు లూపివేసింది. మరో ఆలోచన లేకుండా, వెనక్కొచ్చి, నటేశం పెద్ద కొడుకును పక్కకు పిలిచి అడిగాడు.

"నీకున్నా డబ్బుందా నీ దగ్గర?"

ఆ కుర్రవాడు మొహమాటపడ్డాడు. బలవంతపెట్టగా పెట్టగా చివరకులన్నాడు. "సమయానికి ఇంట్లో ఓ అయిదువందలున్నాయి."

"ఇవ్వాళ ఓ పందకొస్తైగా అయివుంటుంది. అవునా?"

"అవునండీ! మాట పితికకుపైగానే అయింది."

"ఆ డబ్బు చాలకపోతే ఏం చేద్దామనుకుంటున్నావ్?— ఆ డబ్బు ఎటూ చాలదు."

అతను మాట్లాడలేదు. వేల చూపులా చూస్తూ బీదగా నిల్చుండిపోయాడు.

"మీ నాన్నగారు మరో విషయం గూర్చి ఉత్తరం రాశారు. డబ్బు తెమ్మన్నారు. పొద్దున్న తెచ్చాను. చూస్తే ఈ విపరీతం జరిగిపోయింది. అప్పట్నుంచీ ఆడబ్బు నా జేబులోనే వుండిపోయింది. ఉత్తరం చదివేదాకా జ్ఞాపకం రాలేదు. ఇంది. ఈ అయిదొందలూ ఉంచు."

"వద్దండీ! అంత పెద్ద మొత్తం అప్పు చేస్తే తీర్చలేకపోవచ్చు."

"నేనూ, నువ్వు తీర్చాలన్న ఉద్దేశ్యంతో ఇయ్యడం లేదులే!"

తన గుప్పిట్లో వుంచిన అయిదు, పందల రూపాయనోట్లనూ, గుప్పిటమూసి జాగ్రత్త చేసుకోవలసిన అవసరం, ఆ జ్ఞానం ఆ కుర్రవాడు మర్చిపోయాడు. తన చేతుల్లో డబ్బు కుక్కి వెళ్లిపోయిన జమదగ్నివైపే చూస్తూ వుండిపోయాడు.

జమదగ్ని కూడా ఆ డబ్బు తిరిగి ఇచ్చేసింతర్వాత, మనసుకు ఎంతో తేలికనిపించింది. నటేశాన్ని తల్చుకుంటూనే ముందుకు నడిచాడు. అతనికి జీవితం విలువలేనిదిగా భాసించింది. నటేశాన్ని గురించీ, తాడుమాలైన అతని కుటుంబాన్ని గురించీ తల్చుకుంటుండగా తన విషయమే గుర్తుకు వచ్చింది. చలపతి ఆస్తిని తాను అనుభవిస్తూ బాధ తెలుగక బతకడం జ్ఞాపకం వచ్చింది. ఆ జ్ఞాపకంలోనే ప్రసన్న పెళ్లి ప్రస్తావన మనసుకు తగిలింది. అతనిమనసు చురుక్కుమన్నది. తానిప్పుడు దరిద్రుడు. కటిక దరిద్రుడు కాకపోయినా, తిండికీ బట్టకూ వెళ్లిపోతున్నా, వెనుక ఆస్తిపాస్తుల అండగానీ, బ్యాంకు సిల్వల కొండగానీ చూసుకుని ధైర్యంగా [illegible] బతుకగల జీవితాలు కావు!

అప్పుడే, సన్న సన్నగా ప్రారంభించింది వర్షం. శంకరపురం సందు తిరిగేసరికి, తానూ ఆయన వెంటే ఉన్నానన్నట్లు ఉధృతమైంది. నిలబడి కురుస్తున్న వర్షానికి, ఒళ్లు జల్లుమనిపించే గాలితోడైంది. గాలీ, వానా కలిసి జంటగా నడిచి వచ్చేసరికి రోడ్డుమీద వెలుగుతున్న కావలా

దీపాలు కనుమరుగయ్యాయి. అంతా గాఢాంధకారం. జమదగ్ని పూర్తిగా తడిసిపోయాడు. తలంతా నీటి ముద్ద అయింది. మెదడంతా ఆలోచనల ముద్దగా మారిపోయింది.

వేయి అబద్ధాలైనా ఆడవచ్చుట వివాహం జరిపించడానికి! మూడు ముళ్ళు పడడం వరకూ అయితే బాగానే ఉంటుంది. ఆ తర్వాత కథేమిటి?....వివాహమన్నదినూరేళ్ళ కథగదా! మోసగింపబడిన వాని హృదయంలో నమ్మకాన్నీ, అభిమానాన్నీ మరల మనం పాదుకొల్పలేము. తనకు విశ్వనాథం నమ్మిన మిత్రుడు. కరుణ తన ఇంట్లో పెరిగిన పిల్ల. తనకో అయిదారెకరాలు వున్నాయనీ, ప్రావిడెంట్‌ఫండూ, ట్యూషన్ల బాపతు డబ్బూ, పొలంమీది ఆదాయమూ, జీతంలో మిగిల్చిందీ అంతా కలిపిబ్యాంకులో ఒక పది పదిహేను వేలైనా వుండవచ్చునని ఆయన— విశ్వనాథం—భ్రమ పడుతూ వుండి ఉండవచ్చు. భ్రమ తొలిగిపోతే రేపు ఆయన దృష్టిలో తను ఎంతహీనమైపోతాడు! తన వ్యక్తిత్వం దెబ్బతింటుంది. తనో డబ్బు మనిషనీ, మోసగాణ్ణని ఆయన భావించినా భావించవచ్చు. తను మాత్రం ఆ అవకాశాన్ని ఆయనకు ఇవ్వడు. ఆయనకేకాదు, మరెవ్వరికినీ! డబ్బుమీద ఆధారపడి బ్రతుకుతున్న ఈ ప్రపంచంలో తను జీవితంకోసం జీవించాడు. అట్లా కాకపోతే ఈ బడిపంతులు ఉద్యోగం స్వీకరించక, కనీసం ఏ కలెక్టరాఫీసులోనో గుమాస్తాగా చేరివుండును! రెవిన్యూ డిపార్ట్‌మెంట్‌లో చేరితే ఈ పాటికి తహశీల్దారుగా ప్రమోట్‌అయి, రాజాలా తన బ్రతుకు తెల్లవారివుండును!! తను మొదట్నుంచీ డబ్బుకోసం పాకులాడలేదు. తనకే కాదు, శారదాంబకూ ఆ కోర్కెలేదు. మిద్దెలు కట్టలేదనీ, మెడనిండా నగలు చేయించుకోలేదనీ, ఆవిడ ఏనాడూ దిగులు పడలేదు. రేపటినుంచి, తన ఇంటికి కోడలుగావచ్చే ఏ పిల్ల కూడా దిగులు పడకూడదు. ఆలోచనల వర్షపు జల్లు ఎడాపెడా వాయిస్తుండగా, కుండపోతగా కురుస్తున్న వర్షంలో తల నిండుగా తడిసి, విశ్వనాథం ఇంటికివచ్చి తలుపు తట్టాడు జమదగ్ని. "ఎవరూ?" అంటూ కరుణ కంఠం వినిపించింది. "నేనేనమ్మా!— జమదగ్నిని!" ఆ వర్షపు శబ్దంలో ఆ మాట కరుణకు వినబడనట్లున్నది "ఎవరు?" అంటూ మళ్ళీ పిలుస్తూ తలుపుతీసి, "మీరా మామయ్యా! రండి రండి లోపలకు!" అన్నది ఆప్యా

ంగా. హాల్లో వో కుర్చీలో కూచున్న
త్ర, టర్కీటవల్ ఆయన చేతికిస్తూ,
తల తుడుచుకోండి. ఒళ్లంతా తడిసి
ద్దైపోయింది. ఇంత వానలో ఎక్క
్నుంచి వస్తున్నారూ?" అన్నది. ఇంతలో

వంటింట్లోనుంచి హాల్లోకి వచ్చిన విశ్వనాథం, జమదగ్నిని చూచి కొంచెం ఆశ్చర్య పడి, "ఇదేమిటయ్యా! — నీతో పాటు వర్షం వచ్చిందా, వర్షంతోపాటు నువ్వు వచ్చావా?" అన్నాడు నవ్వుతూ.

"రెండూకాదు. నా అంతట నేనూ, దాని అంతట అదీ బయలు దేరాం. మధ్య దారిలోకి వచ్చింతర్వాత ఒహాళ్ల నొహాళ్లం పరిచయం చేసుకుని, కౌగలించుకున్నాం."

జమదగ్ని టవలుతో తల తుడుచుకున్నాడే కాని, వళ్లంతా తడి ముద్దగా వున్న కారణంగా కొంచెంగా వణుకుతున్నాడు. వణుకుతూనే, "నీతో మాట్లాడి పోదామనివచ్చాను" అన్నాడు.

"మాటలు తర్వాత, ముందు ఆ తడి గుడ్డలు విప్పు" విశ్వనాథం ఇంట్లోకివెళ్లి వో క్రొత్త గ్లాస్కో పంచెనూ, ఇస్త్రీ సిల్కు లాల్చీనీ, ఉత్తరీయాన్నీ తీసుకొచ్చాడు.

"వద్దు. వద్దు." జమదగ్ని మొహమాట పడ్డా లాభం లేకపోయింది. తడిగుడ్డలుపిండి ఆరవేస్తానని, కరుణ లోపలికి తీసుకుని వెళ్లిపోయింది. కిటికీ అద్దాలమీద వర్షపు చుక్కలు అందంగా ముత్యాల ముగ్గులు పెడుతున్నాయి.

"అమ్మలూ!—మావయ్య ఇక్కడే భోం చేస్తారుకానీ, వడ్డించమ్మా!"

కుర్చీలో కూచోబోతున్న జమదగ్నిని చూస్తూ లోపలికి కేకవేశాడు విశ్వనాథం.

జమదగ్ని ఉలిక్కిపడ్డాడు. "అబ్బెబ్బే! ఒద్దు. ఒద్దు. అంతా ఒహాటిరెండు గంటలు కాలేదు భోజనం చేసి. ఈ రాత్రి కింక భోజనం చేయదల్చుకోలేదు. అటువంటి ప్రయత్నం ఏమీ వద్దని అమ్మాయితో చెప్పండి."

విశ్వనాథం అతన్ని బలవంత పెట్టడం ఇష్టంలేక, "భోంచేయరటమ్మా!— డికాక్షన్ స్ట్రాంగ్‌గా కలిపి కాఫీ పట్రామ్మా!" అన్నాడు అక్కడినుంచే, లేవకుండా!

కరుణ లోపల్నుంచి, తడిచేతులు చీర చెంగుకు తుడుచుకొంటూ వచ్చింది. "అదేమిటిమామయ్యా— అంత ఆకలిగా లేకపోతే, కాస్త మజ్జిగన్నమే తినండి, మునుకుపోయిందేముంది?"

"వద్దులేమ్మా!" జమదగ్ని వాత్సల్యంతో ఆమెవైపు చూచి, అన్నాడు. "అసలిక్కడికి ఇప్పుడు రావలసింది కాదు."

"అమ్మలూ! కతికితే అతకదేమో నని భయపడుతున్నాడు మీ మామయ్య! ఆయన్ని బలవంతపెట్టవద్దుగానీ, ఆ కాఫీయే పట్రా!"

"వేళకానివేళ అది మాత్రం ఎందుకు?" జమదగ్ని పొడిపొడిగా అభ్యంతరం చెప్పారు.

కరుణ వినిపించుకోకుండా లోపలికి

వెళ్ళిపోయింది. జమదగ్నికి తను వచ్చిన విషయం కుండ బద్దలు కొట్టినట్లు ఎట్లా చెప్పడమో తెలీలేదు. వచ్చిన పనేమిటో ఆయనే చెబుతాడు కదా అన్న ఉద్దేశ్యంతో, వక్కపొడి నములూ్తూ ఎదురుగా వున్న కుర్చీలో మౌనంగా కూచున్నాడు విశ్వనాథం. కరుణ సెగలు కక్కుతున్న కాఫీతెచ్చి ఇచ్చిన తర్వాత, అది ఒకటిరెండు గుక్కలు తాగింతర్వాత గాని, గొంతు పెగలలేదు జమదగ్నికి.

"నేను ఎందుకు వచ్చానంటే!!......." అటూ ఇటూ చూశాడు. కరుణ అక్కడ లేదు. "ఆవిషయం నీతో చర్చించాలని."

విశ్వనాథం కుర్చీలో సావధానుడై కూచున్నాడు. "చెప్పూ" అన్నట్లుగా ఆయన వైపు చూశాడు. "చూడూ! విశ్వనాథం నువ్వూ నేనూ ఒకటే ప్రాణం, రెండు శరీరాలు అన్నట్లుగా ఇంతవరకు మెలిగాం ఇప్పుడు నన్ను నువ్వు మరోలా అర్థం చేసుకో కూడదు."

"నిన్ను అపార్థం చేసుకోవడం, ఈ జన్మకు వుండదు. చెప్పు అసలు విషయం ఏమిటో? — ఇంతవానలో తడిసి వచ్చావంటే, పెద్దవిశేషమే వుండి వుంటుంది!"

జమదగ్ని కాఫీకప్పు క్రింద పెట్టి వక్కపొడి వేసుకుంటూ, "ఇట్లా అడిగానని ఏమనుకోకు. నీకు ఏమాత్రం భూవసతివుంది?"

విశ్వనాథానికి, జమదగ్ని ఆప్రశ్న ఎందుకడిగాడో అర్థంకాలేదు. "ఫర్వాలేదు. ఓ పదెకరాలు పైనేవుంది."

"ఆపదెకరాలూ కరుణకే వస్తుందా."

"ఆహా!— నా తదనంతరం."

జమదగ్ని గొంతు సవరించుకొన్నాడు. "నాకు ఎంత ఆస్తివుందని నీఅభిప్రాయం?

విశ్వనాథం కళ్ళల్లో ఆలోచన ద్యోతకమైంది. "అయిదారెకరాలన్నా వుండదూ?"

జమదగ్ని కుర్చీలో నుండి లేచి నుంచున్నాడు. అటూ యిటూ పచార్లు చేస్తూ అన్నాడు. "అవును. అట్లాగే వుందను కొంటారు అందరూనూ! అంతే కాదు. బ్యాంకీలోకూడా ఏదోకొంత వుండి వుండకపోతుందా అన్న అనుమానం సల్గురికీనూ! నువ్వూ అంతే అనుకొని వుంటావు. ప్రసన్నకు చదువేకాదు, ఆస్తి, ఉండడానికి ఇల్లు, చదువుకోవడానికి డబ్బు— అన్నివున్నాయనుకొనే కరుణను అతడికిచ్చి చేద్దామనుకొన్నావ్! నువ్వు పూర్తిగా పొరపాటు పడ్డావ్ విశ్వనాథం— ఈరోజున నేను బికారిని!— నాదురదృష్టం వాడికి పట్టింది"

విశ్వనాథం సావధానుడై వింటున్నాడు అతని మాటలు. "వివరంగా చెప్పు."

జమదగ్నిలో ఆవేశపుటల ఇంకా పొంగు తగ్గలేదు. "నాకు ఆస్తిలేదు. అది చలపతిది. ఇల్లులేదు. చలపతి వుండమంటే ఉంటున్నాం. డబ్బులేదు. నటేశం దగ్గర దాచుకుంటే, నటేశమే దివాళా అయి, పోయాడు. ఇంక డబ్బేమిటి? అందుచేత.... నీ సంబంధం నేను చేసుకోలేను విశ్వనాథం! కరుణకు మరో మంచిసంబంధం చెయ్."

జమదగ్ని కిటికీదగ్గరకు పోయి, బయట పడుతున్న వర్షాన్ని చూస్తూ నిలబడ్డాడు. లాంతరు నీడల్లో అతని విగ్రహం గోడమీద నిటవాలుగా బక్కగా పడ్డది. అతనిట్లా ఆలోచిస్తుండగా లైట్లు వచ్చాయి. వాతావరణమంతా ఒక్కసారి ప్రకాశమానమైంది. లైట్లు వచ్చిన సమయంలోనే అతని భుజంమీద అప్యాయంగా విశ్వనాథం చేయిపడింది.

ఉలిక్కిపడి వెనక్కు తిరిగిన స్నేహితుణ్ణి చూస్తూ అన్నాడు విశ్వనాథం. "పిచ్చివాడా! నాకీ సంగతులు తెలీదను కొంటున్నావా?"

"నీ కెట్లా తెలుసు?" జమదగ్నికి అతనిమాటమీద నమ్మకం కలగలేదు.

"మొన్న బజారులో చలపతి కనిపించి ఆయనే స్వయంగా చెప్పాడు. ఈ ఆస్తి అంతా తనది అన్నాడు. తను మన్మథను పెంచుకున్నా నన్నాడు. ఆతర్వాత మన్మథను గురించి కాసేపు పొగిడాడు. అప్పుడు దాని అర్థం తెలీలేదు. మొన్న నీ నోటిగుండానే తెలిసింది."

"నేనేమన్నాను?"

"ఏమీ అనలేదు. మన్మథకు కరుణను చేసుకుంటా నన్నావు. పూర్వాపరాలు సమన్వయిస్తే నాకు అర్థం సరిపోయింది. అన్ని అర్థాలు తెలుసుకునే, అందరి మనసులూ అర్థం చేసుకునే నీ దగ్గరకు వచ్చాను"

"ఆస్తి సంగతి సరే! ఇప్పుడు దివాళా స్థితిలో ఉన్నాను. నా దగ్గరవున్న నిలవ నీరంతా నటేశం దగ్గర దాచిపెట్టాను. ఒక్క బొట్టు మిగలకుండా అంతా కొట్టుకుపోయింది."

"కావచ్చు. ప్రసన్న రెక్కలు క్షేమంగా వున్నాయి. మీ సంస్కారం అతనికి అండగా వుంది. అతని చదువు అతనికి పెట్టని కోటగావుంది. పైగా వాళ్ళిద్దరికీ ఒకాళ్ళంటే ఒకాళ్ళకు అభిమానం. ఇన్నిచూసి, ఈ సంబంధం నేను కావాలంటున్నాను జమదగ్నీ! రేపో ఎల్లుండో తాంబులాలు పుచ్చేసుకుందాం. ముహూర్తం కూడా దగ్గర్లోనే పెట్టిద్దాం."

జమదగ్నికి తలవూపక తప్పలేదు. అతనికి ఒక్క విషయంమాత్రం సంతృప్తిగావుంది. తన లోపం కూడా అన్ని విషయాలూ ఆయనకు పూసగుచ్చినట్లు చెప్పాడు. అన్నీ విన్న తర్వాత, డబ్బుకు ప్రాధాన్యత నీయకుండా, గుణానికి ప్రాధాన్యతనిచ్చి ఆయనే సంబంధంకోసం పట్టుపట్టుతున్నాడు. అంతరాంతరాళాలలో మాత్రం జమదగ్నికి, విశ్వనాథమంటే విపరీతమైన గౌరవభావం ఒకటి తళుక్కుమని మెరిసింది. అతని స్నేహానికీ, కరుణ ప్రేమభావానికీ అతని హృదయం ఆర్ద్రమైంది. వాన కొంచెం తగ్గడం చూసి, ఇంటికి బయల్దేరబోయాడు జమదగ్ని.

"గొడుగు తీసుకువెళ్ళు."

"అక్కర్లేదు" అనబోయి, అనలేక, ఆ గొడుగునందుకుని, వీధిలోకి వెళ్ళిపోయాడు జమదగ్ని. ఆయనటు వెళ్ళింతర్వాత, ఆలోచిస్తున్న తండ్రి దగ్గరకు వచ్చింది కరుణ. తన దగ్గరకు ఆమె ఎందుకు వచ్చిందో గ్రహించిన విశ్వనాథం, కూతురి తల నిమురుతూ, "మంచి రోజులుచూచి తాంబూలాలు పుచ్చుకొంటున్నామమ్మా!" అన్నాడు. అని, కరుణ కళ్ళలో విరిసిన ఆనందజ్యోతిని, పెదవులపై పూసిన సిగ్గు మొలకల్నీ చూసి ఆనందపడ్డాడు. ఆయనకు జమదగ్ని అమాయకత్వమూ, ఆమెకు ఆయన మంచితనమూ జ్ఞాపకం వచ్చాయి.

జమదగ్నికి మాత్రం,వీధిలో నడుస్తున్నా నటేశం తన ఎడల కనబరచిన గౌరవభావమూ, విశ్వనాథం తన పట్ల చూపించిన స్నేహభావమూ మరల మరల జ్ఞాపకానికి రాసాగాయి. తన డబ్బు పోతేపోయింది గాక, నటేశం చివ్వరి గడియలలో కూడా తన పట్ల నమ్మకం చూపించాడు. తనకు డబ్బు లేకపోతేనేమి!— ఆ సంగతి తెలిసి కూడా విశ్వనాథం తన సంబంధం కావాలని పట్టుపడుతున్నాడు!! జమదగ్నికి ఏదో పెద్దభారం తలమీదనుంచి దిగిపోయి, హృదయం తేలికపడినట్లయింది. గాలిలో తేలిపోతున్నట్లుగా ఇంటికి వచ్చేశాడు.

(సశేషం)

# నల్లనివాడు

కృష్ణమూర్తి




"నల్లనివాడు, పద్మ నయనంబులవాడు
కృపారసంబు, పై జల్లెడు ....."

ఈ పద్యం హాయిగా చదవటం విననివాడు ఆ వూళ్ళో లేడంటే అతిశయోక్తి కాదు. సుబ్బయ్యగారు రోజూ తెలతెలవారుతుండగానే లేచి భాగవతంలోని పద్యాలు చదువుతూ ఉంటారు. వీధి అరుగుమీద కూర్చుని రోజూ అలా పద్యాలు ఇంపుగా చదవటం ఆ వూళ్ళోని ఆబాల గోపాలం ఎరుగుదురు. సుబ్బయ్యగారంటే కలవపాముల గ్రామంలో అందరికీ గౌరవం.

సుబ్బయ్యగారు ఆవూరు వచ్చినప్పుడు ఆయనకున్న ఆస్తల్లా పై మీదబట్ట, నలుగుర్నీ మంచి చేసుకోగల నేర్పు. అందరికీ తల్లో నాలుకలా మెలిగారు. పదిమంది చేత మంచివాడనిపించుకున్నాడు. కావాలని సించుకున్నారు.

ఆయన తన స్వశక్తితో నాలుగెకరాల కొండ్ర, ఉండటానికి కింత కొంప, గొడ్డు గోద సంపాదించుకున్నారు. ఆయనలోని మంచితనంకన్న, ఆయన భక్తి, కమ్మగా పద్యం చదివే నేర్పు అందర్నీ ఆకర్షించాయి. తీరికసమయాల్లో సుబ్బయ్యగారు భారత భాగవతాలు చదివి వినిపిస్తూనే ఉంటారు. ఆయన్ని అంతా "శాస్త్రుల్లు" గారు అని పిలుస్తారు. ఇప్పటికీ గంభీరమైన హంద హాసమే ఆయన సమాధానం.

సుబ్బయ్యగారు రోజూ ఉదయాన్నే పద్యాలు చదివేవేళ, పాలేరు నర్సిగాడు వచ్చే వేళ ఒకటే. నర్సిగాడికి "నల్లనివాడు" పద్యం చాల ఇష్టం. వాడా పద్యాన్ని ఆయన చేత రోజుకోసారిఅయినా చదివించుకుంటాడు. సుబ్బయ్యగారు నవ్వుతూ "ఏరా! నర్సిగా, ఎందుకురా నీకీ పద్యం అంటే పిచ్చి. కృష్ణ పరమాత్మలా నీవుకూడ నల్లగాఉన్నావనా...?" అని అంటూండేవారు. నర్సిగాడి దగ్గర దానికి సమాధానం లేదు. అయినా వాడికా పద్యం ప్రాణం.

సుబ్బయ్యగారు వ్యవహారదక్షులు. ఆయనకు పరోపకారంలో ఎంత ఉదారబుద్ధి ఉందో, స్వకార్య నిర్వహణలో అంతటి నిష్కర్షత ఉంది. అందుకే ఆయనంటే అందరికీ భయమూ, భక్తీ.

ఆయన మునిమాపువేళ పొలం నుండి తిరిగి వస్తున్నారు. వెంట నర్సిగాడు గడ్డిమోపు నెత్తి నెత్తుకొని వస్తున్నాడు. దారి పొడుగునా ఏహో పొలం విషయాలు మాట్లాడుతున్నారు. మాటల్లో ....

"నర్సిగా ...." అని ఆగిపోయారు.

నర్సిగాడి నడకలోని వూపు తగ్గింది. "ఏంటి దొరా ...." అన్నాడు. సుబ్బయ్యగారు నడక సాగిస్తూనే ఆలోచనలో పడ్డారు.

"మన గిత్తదూడకి తగిన జోడు దొరికితే బాగుండురా. మంచి అరక తయారవుతుంది ...."

"అవును దొరా. మన దూడకి మూంచి లచ్చనాలున్నాయి. సరిపడ జత కొనాలి ..."

"సరే. సమయం కలిసిరావాలిగా ..." అంటూ నడక వేగం హెచ్చించారు.

సుబ్బయ్యగారు తమ దూడకు దీటైన దాన్ని కొనాలని ప్రయత్నాలు చేస్తున్నారు. ఆయన దొడ్లో గొడ్లని ఇంట్లోని మనుషుల కన్న మిన్నగా చూసుకుంటారు. వాటితో ఆయన మాట్లాడుతారు. పేర్లతో పిలుస్తారు.

ఏ కారణంగానైనా ఒకరోజు ఆయన వాటిని చూడకపోతే ఆరోజు ఆయనకీ తోచదు, వాటికీ తోచదు. కట్లు కొయ్యల చుట్టూ తిరుగుతాయి.

రోజూ వచ్చే సమయానికి .... నర్సిగాడు ఆరోజు రాలేదు. ఏదో అలవాటు ప్రకారం పద్యం చదువుతున్నారు కాని చూపు మాత్రం నర్సిగాడు వచ్చే దారి నుండి మరలలేదు. పొద్దు బాగా మిన్నెక్కింది. అయినా నర్సిగాడు రాలేదు.

చిరిగిన లాగూ తొడుక్కొని వచ్చాడు కిట్టు. వాణ్ణి చూడగానే సుబ్బయ్యగారు ఆత్రంగా పలకరించారు..... "ఏరా .... మీ అయ్య రాలేదేం ...." అని. కిట్టు భయపడుతూ "మా అయ్య లెగవ లేదుండి .... ఒకటే జొరం ...." అని పాఠం వప్పచెప్పినట్లు చెప్పాడు. సుబ్బయ్యగార్ని చూసి వాడు భయపడిపోయాడు. తన భారీ శరీరాన్ని కదలించి అరుగు క్రిందకి దిగారు. ఆయనలో ఆగ్రహమో, అనుగ్రహమో తెలియని భావాన్ని చూసి పసివాడు మరింత భయపడ్డాడు. "తలుపు దగ్గిరసా వేసుకో.." అని భార్యనుద్దేశించి లోపలికి కేకవేసి, కండువా దులిపి భుజాన వేసుకొని, "పదరా ...." అన్నారు ఆయన.

ఎక్కడికి పోవాలో తెలియని వాడి పసి మనస్సు – ఇంటికే వెళ్లింది. వాడి వెనక సుబ్బయ్యగారు నడుస్తున్నారు.

దారిలో కనబడ్డ గంటయ్యగారు మాట్లాడుతుంటే .... కిట్టు ముందుకు సాగిపోయాడు. మాట్లాడటం పూర్తి అయిన సుబ్బయ్యగారు వాణ్ణి రెండంగల్లో కలుసుకున్నారు.

పూరి గుడిశే అయినా అమర్చినట్లుంది. చూరు కప్పిన అరుగుమీద నర్సిగాడు చింకి చాప పరచుకొని పడుకున్నాడు. కిట్టిగాడు పంజాలోంచి తప్పించుకున్నవాడి మాదిరి ఇంట్లోకి దూసుకుపోయాడు. మనిషి అలికిడి విన్న నర్సిగాడు కళ్లు తెరిచి అసామిని చూసి ఆశ్చర్యపోయాడు. లోపల్నుండి నర్సిగాడి పెళ్లాం గూడ బైటకు వచ్చి .... సుబ్బయ్యగార్ని చూసి కొంచెం తలుపు వెనక్కు తప్పుకుంది.... పమిటె ఒంటినిండా కప్పుకుంటూ....

సుబ్బయ్యగా రంతటివాడు తన యింటికి రావటాన్ని వాడు కలలో కూడ వూహించలేదు. ఆయనలోని దయార్ద్రతకి మనస్సులోనే జోహారు లర్పించినా .... ఆయనకు తగిన మర్యాదగ కనీసం కూర్చునే చోటునైనా చూపించలేని తన హీనతకు సిగ్గుపడ్డాడు.

"ఏరా నర్సిగా ! ఎల్లా ఉంది జ్వరమా ! మందు పుచ్చుకున్నావా ...." లాంటి ప్రశ్నలు ఒకే వరుసలో గుప్పించా రాయన, వాటికి సమాధానమైన వస్తుందా లేదా అని ఆలోచన లేకుండా. నర్సిగా డింకా తన స్థితినుండి కోలుకోనేలేదు. వాడి భార్య కొంచెం ధైర్యం చేసి.... "కూర్చోండి దొరగారు...." అంటూ బైటికి వచ్చి మరో చింకిచాప పరిచింది. సుబ్బయ్యగారు చిరునవ్వుతోనే సమాధాన మిచ్చారు. నర్సిగాడు ధైర్యం కూడదీసుకొని.. "ఏంది బాబుగారు .... తమరు రావాలా ... ఏదో నలతగా ఉంది. లేవలేకపోయాను. కొంచెం తగ్గగానే మద్దినేలనైన వత్తాను.... బా.... బు గారు...." అంటు ఆకు కందని, పోకకు పొందని సమాధానాలు చెప్పాడు. సుబ్బయ్యగారు వాడికి ధైర్యం చెప్పి, సొంతం స్వస్థత చేకూరేవరకు పనిలోకి రావద్దని వాడికి చెప్పి, వాడి భార్య నుద్దేశించి "కొంచెం మందూ మాకు జాగ్రత్తగా చూడు...."అని చెప్పి ఇంటికి బైలుదేరి రెండడుగులు వేశారు.

గుడిశెకు కొంచెం దూరంలో చెట్టు కింద కిట్టు, వాడి నేస్తం రాము గిత్త దూడతో ఆడుకుంటున్నారు. అదృశ్యం ఆయ కళ్లల్లో నిలిచిపోయింది. ఆయన నోటి వెంట,

"నల్లనివాడు, పద్మ నయనంబులవాడు" పద్యం లాస్యం చేసింది.

మరి రెండడుగులు ముందుకువేసి వాళ్ల మాటల్ని వింటూ ఏవో లోకాల్లో విహరిస్తున్నారు.

కిట్టు తన్మయత్వంతో ఒక చేతో దూడ మెడ రాస్తూ, రెండో చేత్తో గడ్డి పరకలు సుకుమారంగ నోటి కందిస్తున్నాడు. రాము మాత్రం దూడంటే భయ వున్నట్లుగా కొంచెం దూరంగ నిలబడినా .... ఏవో కబుర్లు చెబుతున్నాడు. ఉన్నట్లుండి కిట్టు రాముమీద కలియబడ్డాడు. అప్పటిదాక రేపల్లెలోని కృష్ణుణ్ణి, ఆలమందల్ని, కొంటె కృష్ణుణ్ణి వెతుకుతున్న గోపికల్ని చూస్తున్న సుబ్బయ్యగారు ఇహలోకంలోకి వచ్చారు. వాళ్లిద్దర్ని విడదీశారు.... ఈ హఠాత్సంఘటన కాశ్చర్యపోతూ.

కిట్టు కోపంలో ఉన్నాడు. సుబ్బయ్యగారంటే వాడి కంతకుముందున్న భయం కోపంలో కరిగిపోయింది. సుబ్బయ్యగార్ని ఉద్దేశించి.... "సూడండయ్యగారు .... దూడని పట్టుకొని పంది, పంది అంటాడు." అని సిర్యాదు చేశాడు. అయితే రాము దూడని 'పంది' అని ఎందు కన్నాడో ఆయనకూ తోచ లేదు. రాము తన నిర్దోషిత్వాన్ని చాటుకునేందుకు ....

"అది కాదండి. మా రెండోక్లాసు పుస్తకంలో ఇల్లాంటి బొమ్మే ఉంది. దాన్ని మా అయ్యవారు 'పంది' అని చదివించారు. ఆ బొమ్మ చాల అందంగ ఉంది. అందువల్ల ఈ దూడని కూడ 'పంది' అని పిలిచాను..." అని వాదించాడు.

సుబ్బయ్యగారు ఒక్కసారిగా గలగల నవ్వేశారు. ఆయన నవ్వుకి చెట్టుమీది పక్షి పిల్లలు కలకల మన్నాయి. పిల్లల మనస్తత్వాలు అర్థంచేసుకుంటూ .... ఇద్దర్ని చెరో చేత్తో నిమురుతూ .... "అది పంది కాదు బాబు .... నంది ...." అని దిద్ది చెపుతూ వాళ్లచేత "నంది" అని రెండు మూడు సార్లు అనిపించారు.

గుమ్మంలో నిలబడి ఈ దృశ్యాన్ని చూస్తూ ఉంది. ఆమె ఆయనకు మనస్సులోనే నమస్కరించింది. "వాళ్లకి దాంతోనే బాబుగారు లోకం ...." అంది మెల్లిగా. సుబ్బయ్యగారు కొంచెం అటుగా తిరిగి "పిల్లలు చురుకైనవాళ్లు. మీవాడు ఏం చదువుకుంటున్నాడు...." అని అడిగారు.

"ఏం సదువో బాబుగారూ. మాకు సదువులు కల్సి ఒత్తాయా. వద్దురా అంటే వినడు. ఏదో పలకా బలపం పట్టుకొని గిలుకుతాడు... ఆ రాసేదేందో మాకేం తెలుసుద్ది."

"పిల్లవాడు బాగా చురుకైనవాడు. రాత్రిళ్లు మాయింటికి చదువుకునేందుకు పంపు" అంటు ఇంటికి దారితీశాడు.

ఆయన వెళ్ళిన దారినే కళ్ళప్పగించి చూస్తూ కర్రెట్లా నిలబడిపోయింది. ఇంతలో ఆటల్లో మునిగిపోయిన పిల్లలిద్దరూ మళ్ళీ కీచులాట ప్రారంభించారు. "ఏందిరా గోల ! ఇంతలో కలిసి ఆడుకుంటారు.... అంతలో దెబ్బలాడుకుంటారు" అంటూ కసిరింది.

కిట్టు ఇచ్చిన భరోసాతో దూడకి దగ్గరగా రాబోయిన రాము పేడ తొక్కి "వెధవ దూడ .... ఎక్కడబడితే అక్కడ పేడ వేస్తుంది...." అని దూడని తిట్టటం వాళ్ళిద్దరి మధ్యా మళ్ళీ కీచులాట లేపింది.

తల్లి మందలింపుతో కిట్టు ఇంట్లోకి వెళ్ళిపోయాడు. రాము .... "గొప్పింటోళ్ళకి వాళ్ళతో ఆటలేంటి...." అన్న కిట్టు తల్లి మాటలోని అర్థం తెలియక తికమకపడుతూ వెక్కి వెక్కి తిరిగి చూసుకుంటూ నడుస్తున్నాడు. మెల్లగా.

కిట్టు దొడ్లోంచి "రామూ ....మద్యాహ్నం బడికి వెళ్ళేటప్పుడు నేను నీ దగ్గరకు వస్తానని సైగలు చేసాడు. పక్కింట్లో చదువుకుంటున్న రాముకి సంతోషం కలిగింది. అక్కడ చక్కగ బుర్ర పంజా ఆడుకుందాం...." అంటూ అరుస్తున్నాడు. తల్లిరాక గమనించి పిల్లిలా మెల్లిగా జారుకున్నాడు. కిట్టు సందేశం అందుకున్న రాము—మెల్లిగా, ఉదాసీనంగా నడుస్తున్నవాడల్లా .... ఎగురుకుంటూ పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు.

కిట్టు తల్లి పెట్టిన చద్దిఅన్నం తిని, జారిపోతున్న లాగుపైకి లాక్కుంటూ, పలక పుస్తకాలు పట్టుకొని బడికి బయలుదేరాడు.

నర్సిగాడు పడుకున్నాడన్నమాటే గాని, వాడి మనస్సు సుబ్బయ్యగారిమీది భక్తితో నిండిపోయింది.

"రాత్రికళ్ళ వాణ్ణి మా యింటికి పంపు" అన్న ఆయన మాటలు ....కిట్టు భావి జీవితానికి వెలుగురేఖలా తోచింది వాడికి.

ఇకటికి నాలుగుసార్లు కొడుకు చదువుని గురించి అడిగి భార్య చిరాకుకు గురి అయ్యాడు కూడ.

*   *   *

"ఏం దొరా ! మన దూడకి జత మాట్టం ఆలోచిస్తుండరా ...." నర్సిగాడు కృతజ్ఞత అంతా మూర్తీభవించినట్లు .... ఆయన వెంట పొలంనుండి వస్తూ అడిగాడు.

"ఒకటి రెండు .... మనసులో ఉన్నాయిరా .... కాని ...." అని వాక్యాన్ని మధ్యలోనే పూర్తిచేయక ఆపివేశారు. నర్సిగాడికి ఆయన మాటల కర్థం చిక్కలేదు. దొర తలుచుకుంటే చెయ్యలేంది లేదు. సాధించలేంది లేదు. అందులోనూ ఆ పూళ్ళో

ఆయన మాట ఆజ్ఞగా వెలామణి అవుతుంది. మరైతే ఆయనెందు కింత ఆలోచిస్తున్నారో తెలియలేదు.

నర్సిగాడికి సంభాషణ పొడిగించేందుకు ధైర్యం చాలలేదు. మౌనంగ వెనక నడుస్తూ ఇంటికి చేరుకున్నాడు. గొడ్లకు మేత, అది చూసి .... కాళ్ళు చేతులు కడుక్కొని ఇంటికి బైలుదేరే సమయానికి దీపాలు పెట్టారు. సుబ్బయ్యగారు వాకిట్లో కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నారు. "వస్తా దొరగారు" అంటూ అడుగులు ముందుకు వేశాడు.

ఎదురుగుండా కిట్టూ పుస్తకాలు పుచ్చుకొని ఎదురయ్యాడు. "బువ్వ తిన్నావంటరా" అని ప్రశ్నించాడు కొడుకుని. 'ఆ' అంటూ చదువుకోటానికి గల తీవ్రతలో తండ్రితో సంభాషణ పెంచటం ఇష్టంలేనట్లుగా గబ గబా పోయి సుబ్బయ్యగారిముందు నేల మీద బుద్ధిగా కూర్చున్నాడు.

"అయ్యగారు ఇప్పుడే పొలంనుండి వచ్చారు ఆరి నెందుకురా కష్టపెడతావు...." అన్న నర్సిగాడి మాటలకి "కష్టం ఏముందిరా? నాకూ కాలక్షేపం అవుతుంది. వాడికీ నాలుగక్షరంముక్కలు వస్తాయి.... నీ దారిని నీవు పో...." అన్నారు. "ఏదో తమ దయ. ఆడు పైకి రాటంకంటే నా క్కావల్సిందేంది .... బాబుగారు ...." అని తృప్తి పడ్డ మనసుతో ఇంటిముఖం పట్టాడు.

వాడి మనస్సులో "నల్లనివాడు పద్మ నయనంబులవాడు ...." పద్యం చదువుతున్న సుబ్బయ్యగారు మూర్తిగొన్నారు.

మోకాలిందుగా సగం బైటికి లాగిన చాప మీద చెయ్యి తలగడగా పడుకున్నాడు. అప్పుడే పనులన్నీ ముగించుకొని .... దూడకి గడ్డివేసి వచ్చి కూర్చుంది వాడి పక్కగా. సీతి కెప్పుడూ కొడుకు చదువుమీద కన్నా, పని పాటలకు ఎప్పుడు చేతికి వస్తాడా అన్నదే ఆలో ఆలోచన. అందుకనే వాడు సుబ్బయ్యగారింట చదువుకోటం సగం ఇష్టంగా ఉన్నా మిగిలిన సగం కష్టంగా ఉంది. రెంటికి చెడిపోతా డేమోనని భయం.

నర్సిగాడు ఆకాశంలోని నక్షత్రాల్ని లెక్కపెడుతూ ఆలోచిస్తూ .... సీతి రాకను గమనించలేదు.

"ఏం కొడుకు చదువును గురించి ఆలోచిస్తుండావా ?" అంటూ పలుకరించింది. కొంచెం వెటకారం మేళవించింది.

"ఆడి చదువు మనం ఆలోచించేదేంది అయ్యగారి చేతిలో పడ్డాక బంగారంలా పెరిగిరాడూ ...."

"మరేంటి అంత ఆలోచన ...."

"ఆలోచనే మరి. అయ్యగారు దూడని కొనాలన్నారు. ఒకటి రెండు ఆరి దృష్టిలో ఉండాయన్నారు. మరెందుకో ఆలీసం...."

నర్సిగాడిలాగానే భార్య సీతికీ ఆశ్చర్యం వేసింది. దొరగారు తలుచుకుంటే సాధించ లేంది లేదు. ఆయన మాట లెక్కడా తిరుగ లేదు.

నర్సిగాడే ఆగిపోయిన సంభాషణ ప్రారంభించాడు.

"ఆడే ఎంతాలోచించిన సిక్కటంలేదు...."

"పోనీ ... వూళ్ళో నచ్చైన దూడ లున్నాయా."

"అది తెలిస్తే సగం పని జరిగిపోద్ది ..."

"పోనీ అయ్యగార్ని అడగాల్సింది...."

"ఆయన మాటలు మధ్దినే ఆపేశే, ఇంకేంటి అడిగేది...."

కొంచెంసేపు మళ్ళీ మౌనం రాజ్యం చేసింది. నర్సిగాడు మధ్యలో ఆపిన ముక్కలు లెక్కపెట్టటం ప్రారంభించాడు. సీతి దూడకి మేత చూసి రావాలని వెళ్ళింది.

నర్సిగాడు ఆలోచించటం మొదలు పెట్టాడు.

"మన దూడ బక్కచిక్కిపోతోంది. మన సంపాదన మనకే చాలటంలేదు. ఇంకా దాన్నేం పోషిస్తాము. మనల్ని పోషించే ఆవు చచ్చిపోయింది. దాని దూడని పోషించలేక మనం చచ్చిపోతున్నాం ..."

ఇదీ వాడి ఆలోచన.

ఈవిధంగ సాగిన ఆలోచనలో .... ఏదో ఆశగ మనస్సులో మెదిలింది.

తన ఆలోచనకి కొంచెం అదిరిపడ్డా, తరువాత స్థిమితపడ్డాడు. ఆనాడు వాడికి కలిగినంత ఆత్మశాంతి మరేనాడు కలుగలేదు.

పొలంలో సుబ్బయ్యగారు మౌనంగా ఉన్నారు. పనివాళ్ళను హెచ్చరిస్తూ పనిచేసే నర్సిగాడు ఉదాసీనంగా ఉన్నాడు. వాళ్ళిద్దరి విపరీత చర్యలు మిగిలినవారికి ఆశ్చర్యం కలిగించాయి. మధ్యాహ్నం కూడ పొలంలో పని చేసే సుబ్బయ్యగారు .... ఆరోజున పొయింత్రముగాని రాలేదు. వచ్చినా కూడా మౌనంగానే ఉన్నారు.

సాయంత్రం .... పక్షులు తమ తమ గూళ్ళు చేరుకుంటున్నాయి. గొడ్లకాడి బుడ్డోళ్ళు అల్లాయి పదాలు పాడుకుంటూ

గొడ్లు తోలుకొని ఇళ్లకు చేరుకుంటున్నారు.

సుబ్బయ్యగారొక్కరే ఇంటికి బైలుదేరారు. రోజూ వెంటవచ్చే నర్సిగాడు పొలంలోనే ఆగిపోయాడు. బాగా చీకటిపడిం తరువాతగాని ఇంటికి బైలుదేరలేదు. అడుగులు భారంగా వేసుకుంటూ ఇంటికి చేరాడు.

ఇంటిదగ్గర కిట్టిగాడు పోమూలకూర్చొని ఏడుస్తున్నాడు. తల్లి సముదాయించాలని ప్రయత్నం చేసింది. కాని వాడు ఏడుపు మానలేదు. అందువల్ల చిరాకుతో వాణ్ణి నాలుగు చరిచింది. ఏడుపు మరింత పెరిగింది.

నర్సిగాడికి వాడి ఏడుపుకు గల కారణం తెలుసు. వాణ్ణి వూరడించలేడు. అని ఏడుస్తూ ఉంటే వూరకుండలేడు. "ఏందిరా! నీగోల" అని కసిరినట్లు అడిగాడు. "మరే బాబు... గా...రు" వాక్యం పూర్తికానీయకముందే ... "పోర్మయ్యా .... మంచి సెబ్బరా లేదు...." అంటూ గద్దించాడు. కిట్టిగాడు ఏడుపు మానలేదు. సహనం కోల్పోయిన నర్సిగాడు వాడిని గొడ్డును బాదినట్లు బాదాడు.

ఆపూట అందరూ తలోమూల పడుకున్నారు. వండిన అన్నం కూడ కుండలో నీళ్లు కారింది. కిట్టు ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పడుకున్నాడు. నర్సిగాడు తనని తాను తిట్టుకున్నాడు.

కిట్టు మధ్య మధ్య పలవరిస్తున్నాడు.

"నాన్నా .... కొట్టకు .... అమ్మా .... నా ఆనందం ...."

వాడు కలవరించినప్పుడల్లా సీతి భయంగ భర్తవంక చూస్తుంది. నర్సిగాడు తప్పు చేసినవాడిలా తల దించుకునాడు.

తెల్లవారింది. వాళ్ల బ్రతుకులు తెల్లవారాయి. కిట్టుకు జ్వరం పేలిపోతోంది. ఒకటే పలవరింతలు. సీతి కంగారుపడిపోయింది.

"నాన్న కొట్టకు .... అమ్మా నా ఆనందం...." ఇదే వాడి కలవరింత.

ఆనందం ఎవరో అంతుపట్టని నర్సిగాడు, సీత, జ్వరానికి కారణం వేరుగా వూహించారు. మామూలు ప్రకారం రాము వచ్చాడు. రాముని చూడగానే సీతి జావురుమంది. వాడు తెల్లమొగం వేశాడు. నర్సిగాడు మెల్లగా తేరుకొని "మా బాబుకి రాతిరి నుండి.... జొరం ..." అన్నాడు.

ఆమాట వింటూనే రాము బాణంలా దూసుకుపోయాడు. కొంచెంసేపటికి రాము [illegible]తో తిరిగి వచ్చాడు. వైద్యుణ్ణి తోడ [illegible]. సీత, రాము తల [illegible] రుతూ.... "మా బాబే .... నాకామాత్రం ఆలోచనే లేదు...." అనుకుంది.

వైద్యుడు నాడి పరీక్షించి మందిచ్చాడు. జ్వరం తగ్గిపోతుందని భరోసా యిచ్చి వెళ్లిపోయాడు. కిట్టుకి జ్వరం తగ్గటానికి బదులు పెరిగింది. నర్సిగాడు ఆదుర్దాగా వైద్యుణ్ణి పిలుచుకు వచ్చాడు. నాడి పరీక్షించి ..... "మందులవల్ల లాభంలేదు .... ఆ ఆనందం ఎవ్వరో వారిని రమ్మనండి ...." అని తన పనైందన్నట్లు వెళ్లిపోయాడు. నర్సిగాడు సీతిని, సీతి నర్సిగాడిని చూడటం తప్ప మరేం చెయ్యలేకపోయారు. 'ఆనందం' విషయం వాళ్లకి అంతు చిక్కలేదు. కంట్లో వొత్తులు వేసు కూర్చునారు. సీతి కిట్టు ఒంటిమీది నుండి చెయ్యి తీయలేదు. వాడు కలవరించినప్పుడల్లా ఉలిక్కిపడుతోంది. నర్సిగాడు వంచిన తల ఎత్తలేదు. అల్లాగే గోడ కానుకుని కూర్చున్నాడు.

బైటనుండి 'నర్సిగా' అని కేక వినిపించింది, సుబ్బయ్యగారి కంఠం వినగానే నర్సిగాడు ఆదరా బాదరా వాకిట్లోకి పరుగెత్తుకొచ్చాడు. ఆయన ప్రశ్న అడక్క ముందరే... "బాబుకి నిన్నటేల నుండి .... ఒకటే జొరం. అందుకని.... అందుకని...."

"పనిలోకి రాలేదు." అంటూ లోపలికి అడుగుపెట్టారు సుబ్బయ్యగారు. ఆయనకు దారిచ్చి వెనుకనే నడిచాడు. "దొరగారూ...." వాడి మాటలు ఆయన వినిపించుకోలేదు. వాడిపోయినముఖంతో సీతి నారగా నిలబడింది.

కిట్టు మళ్లీ కలవరిస్తునాడు. సుబ్బయ్యగారు విన్నారు. ఒకసారి వాళ్లవంక పాలోపసగా చూశారు.

సీతి ధైర్యం తెచ్చుకుంది. "దొరగారూ! మూసినకన్ను తెరవలేదు. ఎప్పుడైనా తెరిస్తే ...ఏదో వెతికినట్లు మళ్లీ మూసుకుంటాడు."

"ఆనందం .... ఆనందం.... అంటూ పలవరిస్తుండాడు దొర...." అన్నాడు నర్సిగాడు.

"సరే...." అంటూ బైటకి వెళ్లిపోయారు.

నర్సిగాడు సాగనంపటానికి వచ్చి వాకిట్లో నిలబడ్డాడు. సీతి బాబు దగ్గరనుండి కదలటంలేదు.

"అమ్మా .... నా ఆనందం .... నాన్న కొట్టకు..." పలవరింతలు అల్లాగే ఉన్నాయి. ఉన్నట్లుండి పెద్దగా .... "అమ్మా .... నా ఆనందం...." అని అరిచాడు .... తలి



# నల్లనివాడు

బావురుమంది. ఆదరాగా లేచిన నర్సిగాడు లోపలికి వెళ్లబోయి ఆగిపోయాడు.

సుబ్బయ్యగారు దూడల్ని తోలుకొస్తున్నారు. ఆయన వెనకగా రాము వస్తున్నాడు. నర్సిగాడు ఆయనలోని ఉద్దేశాన్ని గ్రహించలేక బాధపడుతున్నాడు. దూడని తోలుకొని రావటములోని ఆగ్రహమో, అనుగ్రహమో తెలియటంలేదు నర్సిగాడికి.

రాము సరాసరి దూడని లోపలికి తోలు కెళ్లాడు. సుబ్బయ్యగారు వాకిట్లో నిలబడి పోయారు. అడుగు అటు యిటుగా నిలబడ్డాడు నర్సిగాడు.

"నర్సిగా నీకు బుద్ధిలేదురా ....''అన్నారు సుబ్బయ్యగారు. స్థాణువులా నిలబడి పోయాడు నర్సిగాడు.

దూడని చూడటం కిట్నికి అమృతప్రాయం అయింది. మందు లేకుండానే స్వస్థత చేకూరింది తల్లి ఆనందానికి అంతులేదు.

నర్సిగాడు పిల్లిలా అడుగులేసుకుంటూ సుబ్బయ్యగారింట్లో అడుగు పెట్టాడు.

"ఒరే .... నర్సిగా."

నర్సిగాడు ముప్పనంగ నిలబడ్డాడు.

"మీ నల్లనాడు ఏం చేస్తున్నాడురా..."

"దూడతోడిదే లోకం అయింది బాబుగారు.... మన్నించాలి...."

"అది కాదురా .... 'ఆనందం' అన్నది వాడు దూడకి పెట్టిన పేరు...."

"ఆ...." అన్నాడు నర్సిగాడు.

"వాళ్లిద్దరూ చూడరా .... బలరామ కృష్ణుల్లా .... ఆ దూడతో ఆడుకుంటుంటే చూడటమే నాకు ఆనందం."

"మరి మీకిచ్చిన మాట...." తడుముకున్నాడు నర్సిగాడు.

"ఇంతకంటే ఏం కావాలిరా .... హాయిగా వాళ్లు వాటితో కలిసిపోయి ఆడుకుంటూ మన పల్లెనే వ్రేపల్లె చేసేస్తే.... చూడటం ఆనందం ...."

నర్సిగాడి కళ్లు చెమ్మగిల్లాయి.

మెల్లిగా పనిలోకి పోయాడు.

సుబ్బయ్యగారు .......

"నల్లనివాడు, పద్మ నయనంబులవాడు కృపారసంబుపై జల్లెడివాడు...." పద్యాని చదువుకుంటూ తన్మయత్వం చెందారు. ●

# సంక్రాంతి సరదాలు

అంటువ్యాధంటావా
డాక్టరూ?

పెళ్ళిరోజునే
అనుకున్నారందరూ
ఏమోవాడు నాకన్నా
పొడుగని

ఏవిటో కులాసానా!
........ అయితే
రాంగ్‌నంబర్
కులాసాయే

కరెంటు పొదుపు
చేద్దామనే తక్కువ
పవరుబల్బు వాడు
తున్నాడాయన

ఏవిట్రోయ్! మేనేజరు
తెగ బట్టలు కుట్టిం-
చినట్టుంది. మొన్న
టైలర్ కొలతలు
తీస్తుంటే
చూసా

బట్టలేమో!
ఏంటేమో!
కుర్చీ చేయించు
కోవడానికే

# ఆహారం!

ఆహార సమస్య పరిష్కరించకపోతే, ఇక వేరే పరిష్కరించవలసిన సమస్యలేవీ ఉండవు. ఇది అందరికీ తెలిసిన సత్యం. ప్రస్తుతం భారతదేశం ముఖ్యంగా, ఎదుర్కోవలసినది ఆహార సమస్య. అందుకనే, కొత్త సంవత్సరంలో వ్యవసాయానికి సంబంధించిన పండగ సందర్భంలో ఈ వ్యాసం వేస్తున్నాము. వ్యాస రచయిత అభిప్రాయాలు అందరికీ నచ్చకపోవచ్చు. అసలు ఆహార ధాన్యాల ఉత్పత్తికి సంబంధించిన అంకెలు నమ్మతగ్గవి కావని ఎందరో నిపుణుల అభిప్రాయం! అటువంటప్పుడు, ఆహార ధాన్యాల ధరల పెరుగుదలతప్ప మరేదీ నిజం కాదేమోనన్న అనుమానం మామూలు ప్రజలకి కలుగుతుంది. ఆహారధాన్యాల రవాణాకి సంబంధించిన నిర్బంధాలు తొలగిస్తే సగం కష్టం తీరిపోతుందని కొందరి అభిప్రాయం. రైతులకి ఎక్కువ ఉత్పత్తికి కావలసినంత ప్రోత్సాహం లేదని మరికొందరి అభిప్రాయం. పారిశ్రామికాభివృద్ధి వల్ల వ్యవసాయాభివృద్ధి వెనుకబడుతోంది కాబట్టి ప్రభుత్వమే ఆహార ధాన్యాలని మంచి ధరలకి కొని సరఫరా చెయ్యాలని కొందరంటారు. రవాణాలో, నిలవలో ఎంతో దండుగ జరుగుతున్నట్లు నిపుణులు మనకి చెప్తారు, సరఫరా అంతా ప్రభుత్వమే తీసుకుంటే ఈ దండుగలు మరింత అధికం అవుతాయని వీరి అనుమానం. రాజకీయాలకీ, ఆహారోత్పత్తి, విక్రయాలకీ చాలా సన్నిహిత సంబంధం ఉంది కనుక అవసరమయిన సంస్కరణ అంత త్వరగా జరగకపోవచ్చు. ఏది ఎలా ఉన్నా జనానికి కావలసినంత తిండి పదార్థాలు దొరకటం లేదన్నది మాత్రం నిజం. మన భోజన పద్ధతులలో కూడా చాలా మార్పులు రావాలి. అన్నిటికన్నా ముఖ్యం ఆధునిక పద్ధతుల వినియోగమేమో! సరయిన రసాయనాల ఉపయోగంతో పంటని పది రెట్లదాకా అధికం చెయ్యవచ్చునట......



ఇండియా లో

ఆహార సమస్య అనేది అన్ని దేశాలకు ఉంది. మన దేశానికీవుంది. అయితే ఆ దేశాలను వాటి జనాభానుబట్టి, వారి ఆహారపు అలవాట్లనుబట్టి, వారు పండించే పంటలనుబట్టి, పారిశ్రామికాభివృద్ధి బట్టి, ఆహార సమస్య అనేది పలు రకాల ఉత్పన్నం అవుతూ ఉంటుంది. సమగ్రమైన స్వయం పోషకత్వం అనేది ఏ ఒక్క దేశా[నికీ] లేదు. ఎప్పటికప్పుడు ఎదురయ్యే ఆహా[ర] సమస్యలను పరిష్కరించుకొనడానికి, దేశీ[య] పరిస్థితులను బట్టి ఆయా దేశాలు ప్రయ[త్నిస్తూ] ఉంటాయి. మనం కూడా అటువంటి ప్రయత్నాలు చేస్తున్నాము. కాని వాటి స్వరూప, స్వభావాలు విభిన్నంగావుండి, విషమ పరిస్థితులుతెచ్చి పెట్టాయి.

ఆహార సమస్యా పరిష్కారానికి అన్ని దేశాలలోను జరిగే ప్రయత్నాలను రెండు రకాలుగా విభజించవచ్చు. ఒకటి అంతర్జాతీయం. రెండు జాతీయం.

అంతర్జాతీయంగా జరిగే ప్రయత్నాలలో ప్రధానమైనది విదేశ ఆహార ధాన్యాల దిగుమతి. అందుకు సంబంధించిన ఒప్పందాలు కుదుర్చుకొనడం. ఇది అంతర్జాతీయ వాణిజ్య వ్యవహారాలలో అంతర్భాగమేకాని, రాజకీయ సిద్ధాంత విభేదాలు, పోటాపోటీల వ్యవహారంకాదు. కేపిటలిస్టు దేశాల ఆహార ధాన్యాలను కమ్యూనిస్టులు కూడా దిగుమతి చేసుకుంటారు. ఆస్ట్రేలియా కెనడా గోధుమలు కమ్యూనిస్టు చైనా దిగుమతి చేసుకుంటుంది. మనం అమెరికా గోధుమలు దిగుమతి చేసుకుంటాము. అందువల్ల విదేశీ ఆహార ధాన్యాల దిగుమతి అనే దానిని అంతర్జాతీయ వాణిజ్య సమస్యగా పరిగణించాలి. ఈనాడు కేపిటలిస్టు, కమ్యూనిస్టు దేశాలలో ఈ పరిగణనవుంది. కాని మన దేశంలో అది లేదు. ఇది మన రాజకీయ అపరిపక్వానికి ఒక నిదర్శనం. ఇదే మన ఆహార సమస్యకు రాజకీయ స్వరూపాన్ని ఇచ్చింది. ఇలా మన దృక్పథమే మన ఆహార సమస్యా పరిష్కారానికి అంతర్జాతీయ సహకారాన్ని క్లిష్టం చేసింది.

జాతీయమైన ప్రయత్నాలలో ప్రధానమైనది—ఆహార ధాన్యాల అధికోత్పత్తి కృషి. అందుకు తగినట్లుగా ఇరిగేషన్ ప్రో

క్టుల నిర్మాణం. ఎరువుల ఫ్యాక్టరీల స్థాపన. వలురకాలుగా వ్యవసాయోత్పత్తుల పెంపుదలకు ఏర్పాటు. ఇవి చేయడం అనేది ప్రతి దేశ ప్రభుత్వానికి ప్రాథమిక ధర్మం. అధికారంలో ఉన్నది ఏ పార్టీ అయినా, చివరకు ఏ నియంత అయినా ఈ ప్రాథమిక ధర్మ నిర్వహణ జరుగుతూ వుంటుంది. నిజానికి ఇది కూడా రాజకీయాలకు అతీతమైన ఆర్థిక వ్యవహారం. ప్రజా జీవితానికి కీలకం. దీనికి రాజకీయాలను ముడిపెట్టడం, అసలు సమస్యను మూలకు నెట్టడంవలన ఆహార సమస్య పరిష్కారంకాదు. క్లిష్టం అవుతుంది. జాతీయమైన ప్రయత్నాలన్నీ విఫలమౌతాయి.

మన దేశం ఇందుకు చక్కని ఉదాహరణ. ఏ నదీ జలంలో ఏ రాష్ట్రం వాటా ఎంత? ఏ ప్రాజెక్టును ఎక్కడ నిర్మించాలి? ఏ కాల్వ ఎటు త్రవ్వాలి? ఏ ప్రాజెక్టు ముందుగా నిర్మాణం కావాలి? ఎరువుల ఫ్యాక్టరీలు ఏ విదేశ పెట్టుబడితో నిర్మింపజేసుకోవాలి? ధాన్యాల వ్యాపారం ఎలా జరగాలి? వగైరా వగైరాలన్నీ గత ఒకటిన్నర దశాబ్దంగా రాజకీయాలకు నిలయమైపోయాయి. ఇందుకు సంబంధించిన చర్చలు, వాగ్వివాదాలు, పరిశీలనలు వగైరాలలో —మనకు ఆహార సమస్యవుంది. దాని సత్వర పరిష్కారం అవసరం అన్న గుర్తింపు ఏ కోశానా కానరాదు. కాగా కాలయాపన జరిగింది. ఆహార సమస్య క్లిష్ట దశను అందుకుంది.

క్లిష్టదశను అందుకున్న మన ఆహార సమస్యను గురించి ఆలోచించుకున్నప్పుడు, నిజంగా మనకు ఆహార సమస్య వుందా? వుంటే అది ఏ రూపంలో ఉన్నది అన్న అనుమానం కూడా సహజంగా కలుగుతుంది. ఇందుకు దేశ నిజ పరిస్థితులు ఉదాహరిస్తే సరిపోతుంది.

దేశ నిజ పరిస్థితులలో ప్రధానాంశం జనాభా. దాని పెరుగుదల. అంకెలరీత్యా దేశ జనాభాను, అందుబాటులోవున్న ఆహార ధాన్యాలను మదింపు వేసినప్పుడు, మనం పండించుకొనే పంటలు మనకు సరిపోని మాట నిజం. ఆ రీత్యా మనకు ఆహార సమస్యవుంది. కాని కాగితంమీద ప్రభుత్వం చూపుతున్న ఈ లెక్కలు నిజమైనవి కాదు. ఇది ప్రత్యక్ష అనుభవం. పంటల లెక్కలు, జనాభా లెక్కలు తయారు చేసిన కరణాలకు, ఉపాధ్యాయులకు ఈ సంగతి పూర్తిగా తెలుసు. అందువల్లనే ఆ లెక్కల ఆధారంగా చూపుతున్న రూపంలో ఆహార సమస్య అనేది లేదని వాదించడం జరుగుతూ వుంది.

దేశ నిజ పరిస్థితులలో మరొక ప్రధానాంశం: ప్రజల ఆహారపు అలవాటు, ఆర్థిక స్తోమత. ప్రజలకు ప్రాంతీయమైన ఆహారపు అలవాట్లు కొన్ని వంశ పారంపర్యంగా ఉన్నాయి. ఆర్థిక స్తోమతనుబట్టి అవి మారుతూ వస్తున్నాయి. ఉదాహరణకు కొందరికి బియ్యం ప్రధాన ఆహారం కాగా, కొందరికి గోధుమలు వాడకం తప్పనిసరి. అలాగే కొందరికి జొన్నలు. మరికొందరికి రాగులు. ఆర్థికస్తోమత హెచ్చినప్పుడు జొన్నలు వాడుకొనేవారు బియ్యం వాడతారు. అలాగే ముతక బియ్యం స్థానే సన్న బియ్యం. నాణ్యాన్నిబట్టి రకరకాల గోధుమల వాడకం జరుగుతుంది. ఉపాహారాల విషయం కూడా ఇంతే. ఉత్తరాదివారికి తీపి పదార్థాలు అవసరం దక్షిణాది వారికి కారపు సరుకు ముఖ్యం ఈ విధంగా మారుతూవుండే ఆహారపు అలవాటునుబట్టి, వాటిని ప్రజలు మార్చుకుంటూవుండే ధోరణినిబట్టి చూడగా అంకెలలో చూపుతున్నంతగా ఆహార సమస్య మనకు లేదేమో అనిపిస్తుంది.



అమెరికానుంచి 150లక్షల టన్నుల ఆహారం.....సంతకాలు!

దేశ నిజ పరిస్థితులలో ఇంకొక ప్రధానాంశం— రైతుల సాంప్రదాయం. పంటలు పండించే పరిస్థితులు. సామాన్యంగా రైతు పండించిన పంటను ఒకే దఫాగా మార్కెట్‌లో విక్రయించడు. కుటుంబ అవసరాలకు, కూలీలకు కొంత నిల్వ చేస్తాడు. ధరలను బట్టి, దఫాలు వారీగా విక్రయిస్తాడు. వచ్చే ఏడాది పంటమీద నమ్మకం ఉండదు కనక భద్రత దృష్ట్యా వ్యవహరిస్తాడు. ఇంక పంటలు పండించడం ఆర్థికదృష్ట్యా జరుగుతుంది. ధరలనుబట్టి పంటల రకాల్లు మార్పు చెందుతాయి. చక్కెర ఫ్యాక్టరీలు, నూలు మిల్లులు, సిగరెట్టు కంపెనీలవల్ల పంటల పథకం మారుతుంది. ఈ మార్పుల ప్రభావం ఆహార సమస్యమీద కనిపిస్తుంది. అంటే మార్కెట్‌కు అందుబాటు కాగల పంటల స్వరూపం, సప్లయిల పరిమితి మారుతుంది. దీనివల్ల రూపొందే ఆహార సమస్య, ధరల సమస్యగా ప్రత్యక్షం అవుతుంది.

దేశ నిజ పరిస్థితులలో మరొక ప్రధానాంశం — పారిశ్రామికాభివృద్ధి. బస్తీల జనాభా పెరుగుదల, రహదార్ల అభివృద్ధి వల్ల ఒక ప్రాంతంనుంచి ఒక ప్రాంతానికి

తిరిగే ప్రయాణీకులు (ఫ్లోటింగ్ పాపులేషన్) వారికి అవసరం కాగల ఆహారం సప్లయిలు; గత పదిహేను సంవత్సరాలలో సంభవించిన ఇందుకు సంబంధించిన పరిణామాలు లేదా అభివృద్ధి; మన ఆహార సమస్యకు కొత్త అర్థాన్ని ఇచ్చాయి. హోటళ్ళు, బస్తీలు, ఆహార ధాన్యాల వ్యాపారం అనేది దీనికి ప్రాతిపదికగావుంది. ఈ దృష్ట్యా చూచినప్పుడు, మన ఆహార సమస్య కేవలం సప్లయిల సమస్యగా ప్రత్యక్షం అవుతుంది.

దేశ నిజ పరిస్థితులలో ఇంకొక ప్రధానాంశం—ప్రభుత్వం అనుసరించే ద్రవ్యోల్బణ విధానం. పంచవర్ష ప్రణాళికల అమలుకు లోటు బడ్జెటుల ద్వారా, ద్రవ్యోల్బణ విధానాన్ని ప్రభుత్వం అనుసరిస్తున్నది. అందువల్ల ప్రజల చేతుల్లో డబ్బు సప్లయి పెరుగుతున్నది. ఆ డబ్బుతో ప్రజలు కొనగలిగినన్ని సరుకులు మార్కెట్టులో అందుబాటులోలేవు. ఇది ధరల పెరుగుదలకు దారి తీస్తూవుంది. దీనిని అరికట్టడానికి ఒకవైపున పన్నులభారం పెంచుతూవుంది. మరొకవైపున సరుకులపై సప్లయిల కంట్రోలు విధిస్తున్నది. ధాన్య సేకరణ,

# ఆహారం!

ధరల కంట్రోలు, రేషనింగ్ పద్ధతులు ఈవిధానంలో అంతర్భాగాలు అయినాయి. దీనితో మన ఆహారసమస్య మార్కెట్టుకు సప్లయిల సమస్యగా మనకు కానవస్తున్నది.

దేశ నిజపరిస్థితులలో మరొక ప్రధానాంశం— హెచ్చుధర చెల్లించగలిగినప్పుడు ఎలాంటి ఆహారం అయినా లభించడం. నిజంగా దేశంలో ఆహార సప్లయిల కొరత వుంటే ఇదెలా సాధ్యపడుతున్నది? అందువల్లనే మన ఆహారసమస్య, నిజంగా సప్లయిల సమస్యకూడా కాదు. మార్కెట్ పరిస్థితులతో ముడిపడివున్న వ్యాపార సమస్యగా అర్థం అవుతుంది.

ఇలా దేశంలోని నిజపరిస్థితులనుబట్టి చూచినప్పుడు మన ఆహార సమస్య, సప్లయిలసమస్య, ధరల సమస్య, వ్యాపార సమస్యగావుంటనిపిస్తుంది. ఈమూడురకాల సమస్యలను సమన్వయ పరచినప్పుడు, అది మార్కెటింగ్ సమస్య అవుతుంది. దీని పరిష్కారానికి ప్రభుత్వం మూడురకాల విధానాలను అనుసరించింది. సప్లయిలను పెంచడానికి విదేశాలనుంచి దిగుమతులు చేస్తున్నది. ప్రాజెక్టులు కడుతున్నది. సాంద్ర వ్యవసాయ పథకాలు అమలు జరుపుతూవుంది. ఎరువులు, విత్తనాలు సప్లయి చేస్తున్నది. ఇందువల్ల ఉత్పత్తి పెరిగినా, అవసరమైనంతగా సప్లయిలు పెరగడం లేదు. ధరలపై కంట్రోలు విధించింది. ఆచరణలో అదీఫలించలేదు. వ్యాపారానికి స్వేచ్ఛ ఇచ్చింది. ధరలు పెరిగి సందువ చిక్కు వచ్చింది. చివరకు ధాన్యసేకరణ, రేషనింగ్ విధానాలు ప్రవేశపెట్టింది. వీని ఫలితాలుకూడా ఎలా వుంటాయనేదివేరుగా చెప్పవలసిన అవసరం లేదు. మొత్తంమీద ప్రభుత్వం అనుసరించిన ఆహారవిధానాలు అన్నీ ఆచరణలో విఫలమైనాయనేది ప్రత్యక్ష అనుభవంగా వుంది.

అయినప్పుడు పరిష్కారమార్గం ఏమిటి? ఈప్రశ్నకు సమాధానం పొందడానికిగాను మరికొన్ని నిజపరిస్థితులనుకూడా అంగీకరించడం అవసరం. అందులో వాడకందారులుగా, వ్యాపారులుగా, ఉత్పత్తిదారులుగా ఉద్యోగులుగా భారత పౌరుల తత్వాన్ని గమనించడం అవసరం. ప్రభుత్వం ఏవిధానాన్ని అమలుజరిపినా, దానినిజయప్రదం చేయవలసిన బాధ్యత ఈనాలుగువర్గాలవారిమీద వుంది. ఆబాధ్యత నిర్వహణలో కేవలం స్వార్థానికి సంబంధించిన లాభదృష్టి, ప్రయోజనాలదృష్టిమాత్రమే కాక, పౌర జీవితానికి సంబంధించిన చిత్తశుద్ధి, నీతి— నిజాయితీకూడా కొంతవరకైనా వుండాలి. ఇవి ఎంతగా లోపిస్తే, అంతగా సాంఘికజీవితం దుర్భరం అవుతుంది. ఇవి ఎంత ఎక్కువగావుంటే అంతగా సంఘ జీవితం సుఖమయం అవుతుంది. దీని ప్రభావం ప్రభుత్వంమీద, ప్రభుత్వ విధానాలమీద కూడా తప్పకుండా కనిపిస్తుంది. వాడకందారుల అలవాట్లు, వ్యాపారులపద్ధతులు, ఉత్పత్తిదారుల సాంప్రదాయాలు, ఉద్యోగుల ధోరణులు మారనంత వరకు మన ఆహారసమస్య పరిష్కారంకాదు. సక్రమమైన ఆహారవిధానం రూపొందదు. వాతావరణ పరిస్థితులను బట్టి పంటల రాలుబడిలో మార్పులు వస్తున్నట్లుగానే, పౌరుల మానసిక తత్వాన్ని బట్టి వున్న ఆహార సమస్యకూడా రకరకాలుగా మనను వేధిస్తూ వుంటుంది.

—వి. వి.



“ఈ కాఫీలో ఈగ ఎప్పుడు పడిందా, ఇందా. .డిందా?”
“అన్నీ ఎవరు చూస్తారుసార్! ఊహా కిదే పనిమనుకున్నారా??”

ఖనాలుచేస్తే వేడిని ఎక్కువైన పత్రాలు వాలిపోయే రేటును కొలిచి, ఆ గుణము ఎప్పుడూ వున్నదే అని ఒప్పుకుని, దాని ఋణాలమీద నిలబడ్డ గుణాల్ని శోధించు కున్నారు.

1900 సంవత్సరంలో గెయిటెల్ అనే విజ్ఞాని పటములోని విద్యుత్స్పాచని యొక్క గాజు బుడ్గిలో అయానులు లేకుండా తొడివేసిన నిర్మలమైన తటస్థ వాయువును ప్రవేశపెట్టి చూచాడు. నాలుగు రోజులు గడిచాయి తరవాత మామూలే. పత్రాలు వాలిపోవడము మానలేదు. అంటే, నాలుగు రోజులు గడిచేసరికి ఆ గాలి కణాలు తెగి అయానులు ఏర్పడ్డాయి, పత్రాల విద్యుత్తుకు వ్యతిరేక విద్యుదావేశముగలట్టివి వాటిని చేరుకుని వాటి విద్యుదావేశాన్ని హరించాయి. గాలికణాలు అయానులుగా తెగ డానికి కారణ మేమిటి?

పి. టి. ఆర్. విల్సను విద్యుదావేశము శాడలోంచి పోతూవుండలేదని నిరూపించ



డానికి కాడ నడుమ గంధకపు తునక ప్రవేశ పెట్టాడు. పత్రాలూ, గాజుబుడ్డీ రకాలూ మార్చిచూశారు, రేడియో తీవ్ర పదార్థ లేశములు రేడియో కిరణాలు చిమ్ముతున్నా యేమోనని, స్ట్రాంగు తాను వాడిన విద్యు త్స్పాచని చుట్టూ సీసపు పలకతో కవచము నిర్మించాడు. విద్యుదావేశితమూ, వికర్షక ములూ అయ్యా కూడా సువర్ణ పత్రాలు వాలిపోతూండడము మానలేదు.

భూమిపై పొరలలోని రేడియో తీవ్ర మాలిన్యాలేమైనా రేడియో కిరణాలు చిమ్మి విద్యుత్స్పాచని చుట్టూ అయానులను తయారు చేస్తున్నాయేమోనని ఊల్ఫ్ అనే వైజ్ఞానికుడు విద్యుత్స్పాచనిని సముద్రము మీదికి వోడమీద తీసుకుపోయాడు. మేక్ లెన్నాన్ కూడా సూచనిని సముద్రంలో తేలే మంచు కొండలమీదికి తీసుకువెళ్లి పరిశీ లించాడు. సువర్ణపత్రాలు క్రమంగా వాల డము మానలేదు. అంటే సువర్ణ పత్ర విద్యుత్స్పాని చుట్టూ వున్న గాలి కణాన్ని ఎదంచి అయానులు తయారుచేసేదేదో భేసుస్రదముమీదా వుందన్నమాట!

1909 లో గోకెల్, బెలూను ఎక్కి విద్యుత్స్పాచనిని భూమికి 14,000 అడు గుల ఎత్తుకి తీసుకుపోయాడూ. పత్రాలు వాలిపోయే రేటు తగ్గలేదన్నాడు. 1913లో ఆస్ట్రియా వైజ్ఞానికుడు హెస్సు బెలూ నులో ఇంకా ఎత్తుకి వెళ్లి అయానులను చేసేదేదో తీక్షణత హెచ్చిందనీ, అదితయారు చేస్తున్నట్టు కనపడేటన్ని అయానులను విజ్ఞాత కిరణాలలో తీక్ష్ణతి తీక్ష్ణమైన గామా కిరణాల ఘాత కూడా తయారు చెయలేదనీ నిరూపించి, ఆ కిరణా లేవో ఆకాశాంతరాళములోంచి వస్తూన్నాయన్నాడు.

ఇవి విశ్వమయూఖాలు. ఇంత సరళంగా అతి నెమ్మదిగా ఆరంభమై, భూమీ, నీరూ, గాలీ గనులూ అన్నిటా విస్తరించి అంభో నిధిపై, తోయ మండలాగ్రముపై చంద్రుని పై, నక్షత్ర పథాలలోనికి విస్తరించిన పరిశోధనా లక్ష్యము మరిలేదు! ●

# డి.సి.ఆర్. గ్రాట్యుయిటీ

హరికిషన్




సూపరింటెండెంట్ సుందర్రావుని ఆఫీసరుగారు పిలుస్తున్నారని ప్యూనువచ్చిచెప్పాడు. అంతవరకూ వంచిన తల ఎత్తకుండా డిస్పోజల్సు చూస్తున్న సుందర్రావు మెల్లిగా తలెత్తి జవానువైపు చూశాడు.

"ఆఫీసరుగారు పిలుస్తున్నారు" అన్నాడు ప్యూను మళ్లీ.

"నన్నా" అన్నాడు సుందర్రావు మెల్లిగా.

"అవునుసార్ మిమ్మల్నే"

సుందర్రావు కుర్చీలోంచి లేచి ఆఫీసరు రూంలోకి వెళ్లాడు. ఆఫీసరు కూడా వంచిన తల ఎత్తకుండానే కాగితాలు చూస్తున్నాడు.

"గ్రాట్యుయిటీ కేసులు మీ సెక్షన్‌లో చాలా డిలే అవుతున్నయ్యి. త్వరగా అన్నీ ఫైనలయిజ్ చెయ్యండి. వోసారి పెండింగ్ కేసులన్నీ పట్రాండి చూస్తాను" అన్నాడు ఏ. ఏ. ఓ. మోహన్‌రావు.

మరో పది నిమిషాల్లో గ్రాట్యుయిటీ పెండింగ్ కేసులన్నీ తెచ్చాడు సుందర్రావు. అన్ని ఫైల్సూ సావధానంగా చూశాడు మోహన్‌రావు. అన్నీ చూసి నిర్లిప్తతగా "సరే, తీసుకు వెళ్లండి" అని ఒక సిగరెట్టు వెలిగించి నిరాశగా పొగ వదిలాడు మోహన్‌రావు. ఆ పొగ కూడా మెల్లిగా రింగులు, రింగులుగా తిరుగుతూ వ్యాప్తి చెందుతూ పైకిపోతూ చివరకు గాలిలో కలసి అంతర్ధానమైపోయింది.

"నీకు సిగరెట్ అలవాటులేదు కదూ" అన్నాడు మోహన్‌రావు.

"లేదుసార్" అన్నాడు సుందర్రావు.

"సిగరెట్ పొగ చూశావా ఎట్లా అంతర్ధానమైందో"

అర్థం కాలేదు సుందర్రావుకు.

"సంసార జీవితంలో ప్రవేశించిన ప్రతివారూ రింగు, రింగుమంటూ జీవిత వలయంలో పరిభ్రమిస్తూ వయస్సు పైనబడగా చివరకు ఆ పొగమాదిరే అంతర్ధానమైపోతారు. అట్లా అంతర్ధానమైపోయిన ఆ ఉద్యోగుల గ్రాట్యుయిటీలు మన ఉద్యోగ ధర్మం నిర్వర్తించుకోటానికిగాను వారి భార్యలకు సంక్రమింప చెయ్యాలి, అవునా" అన్నాడు మోహన్‌రావు.

అవునన్నట్లు తలవూపి ఫైల్సు తీసుకు వెళ్లాడు సుందరరావు. అంత హఠాత్తుగా ఎందు కతను వెళ్లిపోయాడో అర్థంకాక అటే చూస్తూ సిగిరెట్టు పీల్చాడు మోహన్‌రావు.

* * *

సుందర్,

పేరులోఉన్న గొప్పతనం పెంపులోలేదు. నువ్వు నిర్వికారుడివైన సుందరుడివి. నీ మనస్సు అనిర్వచనీయమైనది. మమతలు పెల్లుబికి వచ్చినా ఆ ప్రవాహవేగం భయమూ,

ఆందోళనా అనే రెండు కరకట్టల మధ్య ఒడ్డుల్ని ఒరుసుకుంటూ పోవలసిందే. జీవితం జీవించటానికే నంటారు కొంతమంది. ఆశయాలతో నింపుకున్న జీవితాలకు మెరుగులు దిద్దుకోవాలనుకుంటే, పట్టుదల, ఆత్మ విశ్వాసమూ, దృఢ సంకల్పమూ అనే గ్రూపును తీసుకుని "లోకానుభవం" అనే విశ్వ విద్యాలయంలో చదువుకోవాలి. అక్కడ డిగ్రీ తెచ్చుకుంటే జీవితంలో ప్రతి మెట్టూ ఆ విశ్వ విద్యాలయపు సర్టిఫికెట్‌తో ఎక్కిపోగలం. ఆ విశ్వ విద్యాలయంలో చేరిన మనిద్దరమూ ఎంత చదివినా ఆ గ్రూపులోని పాఠాలు అర్థం కాక తప్పుతున్నాము.

కాలేజిలో చేరిన మొదటి రోజుల్లో ప్రబంధ కావ్యాల్లోని నాయికల్లాగా, జానపద చిత్రాల్లోని హీరోయిన్‌లాగ నన్ను వర్ణిస్తూ, నువ్వు రాసిపెట్టుకున్న ఒకలేఖ పొరపాటున నీ నోట్సు పుస్తకంతోబాటుగా లెక్చరరు వద్దకు చేరింది. లెక్చరరు ఆ కాగితాలు చూసి కోపం పట్టలేక మాటలు తడబడుతూ "ఎవరోయ్ ఈ అపర, అపర....." అంటుండగా వెంకట్రావనే అతను "ప్రవరాఖ్యుడా,

దుష్యంతుడా అంటీ" అన్నాడు. క్లాసంతా ఒకటే గోల. ఆరోజులు తల్చుకుంటే హృదయం ఉప్పొంగి మనస్సు పరవళ్ళు తొక్కుతుంది.

కాని ఆదిమధ్యాంతాలులేని కాలం, ఆ స్వర్గం కలసిపోయిన మనం ఎల్లకాలం విశ్వ విద్యాలయాల్లోనే చదువుకోగలమా? కలవేళ చదివినా ప్యాసవుతామనే నమ్మకమూ లేదుకదా?

ఆలోచనలతో సతమతమై సమస్యను మరింత జటిలంగా చేసుకునేకన్న, సమస్యలు లేని ప్రశాంత సీమల్లోకి నిష్క్రమించ గలమా!

నళిని.

* *

సుందర్,

మొన్న మనం సినిమా హాల్లో కలవని కలయికగా కల్సుకున్నప్పుడు మనం పక్క పక్కనే కూర్చుని హృదయాలువిప్పి మాట్లాడుకున్నప్పుడు, మన ప్రపంచంలో మనం ఉండి చుట్టుపక్కలవార్ని గమనించనే లేదు. ఫలితం ఇంట్లో అమ్మ పెట్టిన తిట్లూ చివాట్లూ, నాన్నగారి కోప తాపాలూ, వీటన్నిటికీ తలొగ్గి తట్టుకోవలసి వచ్చింది. కాని, సంతోషం అవన్నీ చిరునవ్వుతో ఎదుర్కొని భరించాను. అమ్మా, నాన్నా కోప్పడ్డారని నీ చెలిమిని దూరం చేసుకుంటే ఇంక నా వ్యక్తిత్వం ఏముంది? జీవితానికి ప్రాణం ఎంత ముఖ్యమో వ్యక్తిత్వమూ అంత ముఖ్యమే.

అన్నింటికన్నా ముఖ్య విషయం. ఈ వేసవి శలవుల్లోనే మా అక్కయ్య పెళ్ళి. తరువాత ఛాన్సు మనదేకదూ! అందుకు తగిన వాతావరణం మనం కల్పించుకోవాలి కదా!

నీ,

నళిని.

* * *

మేనెల్లో తన అక్కయ్య పెళ్లి శుభలేఖ సుందర్రావుకు పోస్టు చేసింది నళిని. శుభలేఖతోపాటు పెద్ద ఉత్తరం. ఉత్తరం చదివినంత ధ్యాసగా శుభలేఖ చదవలేదు. ఈ పెళ్లికి తను ఎట్లా, ఎవరి తరఫున, ఏ బాంధవ్యరీత్యా వెళ్లాలి? పెళ్లింకా పది రోజులుంది.

మర్నాడు పోస్టులో ఇంకో శుభలేఖ వచ్చింది. ఎవరిదోనని మామూలుగానే చదివాడు. కళ్లు మిరుమిట్లు గొలిపాయి. శరీరం ఉప్పొంగిపోయింది. మనస్సంతా అమితానందంతో నిండిపోయింది. నళిని అక్కయ్య వనజ పెళ్లి తమ దూరపు బంధువర్గంలో తనకు పెత్తండ్రి వరుస అయిన వెంకట్రావు గారి కొడుకు సూర్యారావుతోనే.

మగపెళ్లివారి తరఫున తనూ పెళ్లికి వెళ్లాడు సుందరరావు. ఉన్న రెండు రోజుల్లోనూ ఇరవైసార్లు నళినిని చూశాడు. ఎట్లాగో వీలు చూసుకుని నాలుగుసార్లు మాట్లాడాడు ఎవ్వరూ చూడకుండా. ఆ రెండు రోజుల్లోనూ, నాలుగుసార్లు కల్సుకున్నప్పుడూ రెండు సంవత్సరాల మాటలు మాట్లాడుకుని హర్షపులకాంకితులయ్యారు. వింత వింత సోయగాలతో, రంగు రంగుల చీరెల్లో, రమణీయమైన అలంకారాల్లో కమనీయమైన మాటల్లో కన్నుల పండుగగా చూశాడు సుందర్రావు నళినిని.

జూన్‌లో కాలేజీలు తెరిచారు. గుంటూరు చేరాడు సుందర్రావు. తెనాలినుంచి మళ్లీ చదువుకు నళిని రాకకై ఎదురుచూస్తున్నాడు. నళిని రాలేదు. ఉత్తరంలేదు.

మరోవారం గడిచింది. ఎదురుచూస్తున్న ఉత్తరం రానే వచ్చింది. సంతోషంతో కవరు చించాడు. గుండెలు పగిలినయ్యి. కన్నీటి మసకతో అలుక్కుపోయినట్లు కనబడే అక్షరాలను కూడబలుక్కుని చదివాడు.

నళిని అక్కయ్య వనజ నాలుగు రోజుల జ్వరం తగిలి ఈ లోకాన్ని విడిచిపోయింది. పెళ్ళయిన రెండోమాసంలోనే వనజకు ఆయుష్షు తీరిపోయింది. తండ్రిగారికి తెనాలి నుంచి, విశాఖపట్నం బదిలీ అయింది. ఎల్లుండే ప్రయాణం. ఇంక నళిని కాలేజి చదువు లక్కడే— అని ఆ ఉత్తరం సారాంశం.

ఆరోజునే ఏమీ ఆలోచించకుండా తెనాలి వెళ్లి నళిని తల్లి దండ్రుల్ని పలకరించాడు. నళిని నిర్జీవ ప్రతిమలా కనుపించింది. మేనెల్లో పెళ్ళయిన అక్కయ్య, జూన్‌నెలలో చనిపోతే ఇంక అంతకన్న ఘోరం ఏమిటని విలపించింది నళిని. తల్లిదండ్రుల దుఃఖానికి అంతులేదు. వాళ్ళు పూర్తిగా విచార సాగరంలో మునిగిపోయి ఒడ్డుకు రాలేకపోతున్నారు. పెళ్లికి వెళ్లినపుడు ఆనాడు చూసిన ఆ ఇంటివాతావరణానికీ, ఈనాటి వాతావరణానికీ ఎంత మార్పు? ఆనాటి పెళ్లిల్లు స్వర్గవాటిక. ఈనాటి ఆఇల్లు స్మశానవాటిక. ఆనాటి నళిని అందమూ, ఆనందమూ, ఆప్యాయతా, ప్రేమానురాగాలూ పుణికి పుచ్చుకున్న అందాలబాల. ఈనాటి నళిని శోకమూర్తి. ఆమె సోయగమంతా దుఃఖ సముద్రంలో కరిగిపోయింది. నళిని పరిస్థితి చూసి తనూ కన్నీరు పెట్టుకున్నాడు.

వనజను గురించి, ఆమె మనస్తత్వాన్ని గురించి నళిని చెప్తుంటే అలాంటి సహృదయులకు ఈ లోకంలో ఎక్కువ కాలం స్థానం లేనట్లుగా అనుకుని తనూ విచారపడ్డాడు. అవ్యక్త వ్యధలతో, బరువెక్కిన హృదయంతో గుంటూరు చేరుకున్నాడు. జీవిత గమనంలో అంతలో ఎంత మార్పు?

* * *

సుందర్,

ఇంత ఆలస్యంగా ఉత్తరం రాసాను [illegible] గించుకోమ. [illegible] కాలేజి, కొత్త వాతావరణం కొంత కారణంగా తీసుకోవచ్చు. చక్కని తారురోడ్డుమీద పయనిస్తున్నా గమ్యస్థానాన్ని చేరుకోటానికి ఆ రోడుగాక తారురోడ్డే ఆధారంకాదు. కొన్ని మలుపుల తిరగాలి. జీవితమార్గంలో కూడా ఇలాంటి మలుపులు తప్పవు. అమ్మా, నాన్నా నావిషయంలో ప్రాణాలు నిల్పుకుని బ్రతుకుతున్నారు. ఇది ఇంటి విషయం

ఇంక కాలేజీ సంగతి. [illegible] చదువుతున్నది బి.యస్సీ అని నీకు తెల్సు. [illegible] వాతావరణం, [illegible] మోహనరావనే ఎమ్మె. చదివే విద్యార్థితో పరిచయమైంది. ఆ పరిచయం [illegible] రంతోనే దానిని [illegible] ప్రేమ అనే ముసుగువేసి ముందుకుపోయాడతను. [illegible] సమాధానం నాకు ఏమాత్రం నచ్చలేదు. [illegible] నితో మాట్లాడకుండా తప్పించుకు తిరుగుతున్నా, ఎట్లాగో తారసపడి, కల్పించుకుని నాతో మాట్లాడ్డానికి ప్రయత్నిస్తున్నాడు. ఇదేం ఖర్మమో నాకు అర్థంకావటం లేదు. నా అయిష్టతనూ, కోపాన్నీ నాలో దిగమింగుకుని ఏదిమాటలకు ఒక మాటవిమాటగా జవాబు చెప్తున్నాను. ఒక్కసారి ముఖంమీద కొట్టినట్లు తిరస్కారభావంగా మాట్లాడితే అంత సభ్యత ఉండదేమో?

నీ,

నళిని.

ఉత్తరం చదువుకుని బరువుగా నిట్టూర్పు విడిచాడు సుందర్రావు. ఉరకలు వేసే మనస్సులో కలత వేసింది. కలత వేసిన మనస్సులో ఇదివరకటి పలుకుకు స్థానం లేదు. తనకు తెలియకుండానే నళిని తనకుదూరమై పోతున్నట్లుగా భావించాడు. ఈ ఉత్తరానికి చిన్న సమాధానమే రాశాడు.

నళినీ,

ఉత్తరం చదివి ఉన్మత్తుడ్ని కాలేదు. నీ జీవితం సార్థకం చేసుకోటానికి ఎ

మలుపులు తిప్పుకోవాలనుకున్నావో అన్ని మలుపులూ తిప్పుకో. ఏ మలుపులోనైనా నేను కనిపిస్తానేమో చూస్తావుకదూ!

సుందర్.

ఉత్తరం చదువుకున్న నళిని ఖిన్నురాలైంది. పాఠ్య పుస్తకాలకు నోట్సులు అనేకమంది అనేక తరహాలుగా రాసినట్లుగా హృదయానుభూతులకు మనస్సులోని వ్యాఖ్యానాలు కూడా అనేక రకాలుగా చిత్రించుకుంటారనుకుంది నళిని. ఉత్తరానికి జవాబు ఆగష్టు పదిహేనున రాసింది.

సుందర్,

మనదేశంలో ఆబాలగోపాలం ఈరోజున స్వాతంత్ర్యోత్సవాలు జరుపుకుంటున్నారు. ఈరోజు అందరికీ పర్వదినం. అలాంటి పర్వదినంనాడు నేను నీ కీ ఉత్తరం రాస్తున్నాను.

నువు నన్ను అపార్థం చేసుకున్నందుకు నేను బాధపడినా నీమీద ఏమాత్రం కోపం తెచ్చుకోవటంలేదు. నేనేకాదు ఆ పరిస్థితుల్లో ఎవరున్నా అంతేనేమో! నా జీవిత మార్గంలో ఎన్ని మలుపులు తిరిగినా ప్రతి మలుపులోనూ నువ్వే కనిపిస్తావు. నువ్వు లేని మలుపు లేనేలేదు.

నీ,

నళిని.

* * *

ఆఫీసరుదగ్గరనుంచి వచ్చి తన సీటులో కూర్చున్న సుందర్రావు మనస్సులో ఈ సంఘటనలన్నీ ఒక్కసారి గిర్రున తిరిగాయి.

"సార్, కాఫీ తెమ్మంటారా" అన్న ప్యూను మాటలతో ఊర్ధ్వలోకంనుంచి, ఈలోకంలోకి వచ్చినట్లయింది. కళ్ళు తుడుచుకుని ప్యూనుకు డబ్బులిచ్చి పంపాడు.

* * *

మోహన్రావు అసిస్టెంట్ ఎకౌంట్స్ ఆఫీసరుచేస్తూ, పదేళ్ళగా ఉద్యోగంలో ఉన్నా, ఎప్పుడూ ఆఫీసు కాయితాలు ఇంటివద్ద చూడ్డం తటస్థించలేదు. పని ఎక్కువగా ఉంటే ఇంకాసేపు కూర్చుని ఫైల్సన్నీచూసి సంతకాలుపెట్టి ఇంటికి వెళ్ళేవాడు. ఇంటికి రాగానే భార్యా పిల్లలతో కులాసాగా కబుర్లు చెప్పటమో, షికారుకో, సినిమాకో వాళ్ళను తీసుకు వెళ్ళటమో జరిగేది.

అటువంటిది ఆ గ్రాట్యుయిటీ ఫైలు నాలుగు రోజులనుంచీ ఇంట్లో టేబుల్ మీద ఉంటం చూసేసరికి భార్య అరుణకు ఆశ్చర్యం కలిగింది.

"ఆఫైలు నాలుగు రోజులనుంచీ అక్కడే ఉన్నది, తొందరలేదా" అన్నది అరుణ నవ్వుతూ.

# డి.సి.ఆర్. గ్రాట్యుయిటీ

"అదొక గ్రాట్యుయిటీకి సంబంధించిన ఫైలు. తొందరగా పంపించవలసిందే. ఏమిటో ఆలస్యమైంది" అన్నాడు నిర్లిప్తతగా.

"ఇంతవరకూ ఏ అయిదారొందల పెన్షన్లూ, గ్రాట్యుయిటీ ఫైల్సూ చూసి ఉంటారు. ఇందులో కొత్తేముంది" అన్నది మళ్ళీ అరుణ.

"అవును. కొత్తేముంది. రాత్రికయినా ఆ ఫైలు చూడాలి" లేని నవ్వుతెచ్చుకుని అన్నాడు మోహన్రావు.

* * *

"నళినీ"

"ఊఁ"

"నేనంటే కోపంకదూ"

"తెల్సి కూడా అడగటం ఎందుకూ"

"నిజంగా కోపం వచ్చిందా"

"అక్షరాలా"

"ఎందుకని"

"ఎమ్మే చదువుతున్నా మానవునిలో, అందులో చదువుకున్న వ్యక్తిలో ఉండవలసిన ఔన్నత్యం మీలో స్వర్గస్థమైపోయింది. ఇట్లా వెంటబడి తిరగటం నాకేం బాగుండలేదు"

"నువ్వు నన్ను అర్థం చేసుకోలేదు నళినీ"

"కాదు. పూర్తిగా అర్థం చేసుకున్నాను. నన్ను మీరు ప్రేమిస్తున్నారు. పెళ్లి చేసుకుంటానంటారు. కాని నేనుమాత్రం మిమ్మల్ని ప్రేమించటంలేదు. అంతే తేడా. ఇప్పుడు నా మాటలు మీకు అర్థమవుతున్నయ్యా"

"అవును నళినీ, నువ్వు నన్ను ప్రేమించి ఇష్టపడితే వివాహం చేసుకుందామనే ఉంది"

"సంతోషం. కాని నాకా ఉద్దేశ్యం లేదనే చెప్పానుకదా. ఇక ముందు కూడా ఏ విషయంలో నాకా ఉద్దేశ్యం కలగదు. నమస్కారం."

నళిని విసవిసలాడుతూ తిరిగి చూడకుండా వెళ్లిపోయింది. మోహనరావు శిలా ప్రతిమలా అయిపోయాడు. మర్నాడే మళ్లీ నళినితో కల్పించుకుని మాట్లాడాడు.

"నళినీ"

"ఎందుకు"

"చిన్నమాట"

"నన్ను ప్రేమిస్తున్నట్లుగా చెప్పటానికేకదూ"

"అవును"

కోపంగా చూసింది నళిని.

"నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో, నువ్వు నన్నంతగా తిరస్కరిస్తున్నావని తెలుసు. ఏ పరిస్థితుల్లో మనకు పరిచయమైందో నీకు గుర్తుందనే అనుకుంటాను. నన్ను ప్రేమించినా ప్రేమించకపోయినా, పలకరిస్తే అంత చులకనగా కోపంగా ఎందుకు సమాధానం చెపుతున్నావో నాకు అర్థం కాలేదు. ఆఖరుసారిగా ఒక్కమాట అడుగుతున్నాను. నీ జీవితంలో ఎప్పుడో ఒకసారి నా సాయం పొందక తప్పదు. అది ఏ రీతిగా ఉంటుందో నేను చెప్పలేను" అన్నాడు మోహన్రావు.

చులకనగాచూసి, నిర్లక్ష్యంగా నవ్వుతూ వెళ్లిపోయింది నళిని.

* * *

రెండేళ్ళు కాలచక్రంలో కలిసిపోయాయి. మోహన్రావు ఎమ్మే ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు.

ఒకరోజున అతని కొక కవరు వచ్చింది. కవరుచించి ఉత్తరం తీశాడు. దానితో పాటుగా శుభలేఖ. నళిని వివాహం. వరుడు ఆనందరావు. ప్రొబేషనరీ డిప్యూటీ తాసిల్దారు. ఉత్తరం చదువుకున్నాడు.

మోహన్,

జీవితంలో అనుకోని సంఘటనలూ, సన్నివేశాలూ అనేకం. ఒక వ్యక్తియందు మనకు ఇష్టత లేనప్పుడు ఆ వ్యక్తి పలకరిస్తేనే మన అహం దెబ్బతిన్నట్లయి ఇంగిత జ్ఞానాన్ని వెనక్కునెట్టి నోటికి వచ్చినట్లుగా మాట్లాడుతాం. ఇందుకు తార్కాణం మనమే, కాదు నేనే.

ఆరోజున నువ్వన్నమాట నాకు అనుక్షణమూ చెవుల్లో మారుమ్రోగుతూనే ఉంటుంది. అందుకే శుభలేఖతోపాటు ఈ ఉత్తరాన్ని రాస్తున్నా.

మా పెళ్లికి తప్పక రావాలిసుమా!

నళిని.

ఉత్తరం చదువుకుని మనస్సులో నవ్వుకున్నాడు. శుభలేఖ అందంగా ఫోటోలతోసహా అచ్చు వేయించారు.

* * *

గ్రాట్యుయిటీ ఫైలు చదువుతున్న మోహన్రావుకు పై సంఘటనలు గుర్తు వచ్చినయి. అతనికి పెళ్లి శుభలేఖలు బంధువులవీ, స్నేహితులవీ ఎన్నో వచ్చేవి. ఎప్పటికప్పుడు ఏమైపోయేవో తెలిసేదికాదు. కాని నళిని పెళ్లి శుభలేఖమాత్రం ఇన్ని

సంవత్సరాలూ జాగ్రత్తగా దాచాడు. ఎందుకో ఆలోచిస్తే అతనికే అర్థం కాలేదు. పెళ్ళికి అప్పుడు వెళ్ళనూలేదు. ఉత్తరానికి జవాబూ వ్రాయలేదు. టెలిగ్రాం ద్వారా ఆరోజున గ్రీటింగ్స్ పంపాడు. అంతటితో ఆ బాధ్యత అట్లా తీరిపోయింది.

బీరువాలోని పాత కాయితాలన్నీ తీశాడు. ఎన్నెన్నో కాయితాల కట్టలు తీసివెతికాడు. ఆఖరికి ఆనాటి నళిని పెళ్ళి శుభలేఖ కనిపించింది. కాగితాల కట్టలన్నీ బీరువాలో సర్ది, ఆ శుభలేఖను కనీసం అయిదారుసార్లు చదివాడు. అప్రయత్నంగా రెండు కన్నీటిబొట్లు ఆ శుభలేఖమీద పడ్డాయి. నళినితో తన స్నేహానికి చిహ్నమైన వస్తువు ఆ శుభలేఖ ఒక్కటే. ఆ శుభలేఖ చదువుతుంటే మనస్సునీ, హృదయాన్నీ కెలికినట్లయింది.

రాత్రి పన్నెండింటికికాని ఫైలు ముయ్యలేదు మోహన్‌రావు.

*        *        *

ఆరోజున శలవు పెట్టాడు సుందరరావు. ఏమిటో ఆలోచన, భీతి, దిగులు, అతని భార్యా పిల్లలూ చుట్టాలింట్లో పెళ్ళికి వెళ్ళారు. తనుమాత్రం వెళ్ళలేదు. వెళ్ళాలనిపించలేదు. ఉన్నట్టుండి కుర్చీలోంచిలేచి పెట్టెల్లోని పాత కాగితాలకట్టలన్నీ తీశాడు. దస్తావేజులూ, పాత ఉత్తరాలూ, తండ్రి చేసిన బాకీలు, తీర్చిన ప్రోనోట్లు, ఆ కవరు ఉత్తరం వచ్చి ఎన్ని సంవత్సరాలో అయింది. కాని నిన్న, మొన్న వచ్చిన భావన మనస్సులో కలిగింది. మళ్ళీ ఒకసారి ఉత్తరాన్ని చదువుకున్నాడు.

సుందర్,

ఉత్తరాలు రాయటం లేదని కోపం వచ్చిందికదూ! నీకు నామీద కోపం వచ్చినప్పుడే నాకు సంతోషంగా ఉంటుంది. కోపంలోనే నువ్వు సూటిగా మాట్లాడుతావు. అవునా?

జీవితం ఒక బొమ్మలాట. బొమ్మ నిర్జీవమైనది. మనిషికి ప్రాణం ఉన్నది. బొమ్మకు ఆశలులేవు. మనిషికి ఎన్నో ఆశలూ, ఆశయాలూ. మనం ప్రేమించుకున్నామనీ, హృదయాలు ఇచ్చిపుచ్చుకున్నామనీ మనం అనుకుంటున్నాం. ఆ అనుకున్నాం. మనస్సులో అనేక అనుభూతులు నింపుకుని మాటల్లో చెప్పుకున్నాం. ఒకర్ని విడిచి ఒకరం విడిపోకూడదని చందమామ సాక్షిగా, తారకల సాక్షిగా మన మనస్సాక్షిగా అనుకున్నాం. ఎన్నో వూహలు రేపుకుని మమతల్ని పెంచుకున్నాం.

కాని ఆ పరమాత్ముడు తన లీలలన్నీ మనమీదనే ప్రయోగించాడు. ఆయన ప్రయోగాలకి మనమే దొరికామేమో! నీమీద ప్రేమతో, నీతోడిదే లోకమనే మోజుతో, ఏనాటికయినా మనం భార్యాభర్తలం అవుదామనే వాంఛతో, కాంక్షతో వళ్ళంతా కళ్ళు చేసుకుని, నిన్నే చూడటంతో నాకు ఎవ్వరూ కనుపించలేదు. కనిపించిన మోహన్‌రావుని కసిరికొట్టాను. అతడు ఖిన్నుడై 'కిమన్నాస్తి' అయ్యాడు. జయించా ననుకున్నాను.

కాని ఆశలకు శలలు వేసినయ్యి. కళ్ళకు ఎవరో గంతలు కట్టారు. మన ప్రేమ సెలయేరై, వాగై, నదియై, మహానదిలా పరవళ్ళు తొక్కుతూ, మన ఇరువురి హృదయాలనే కరకట్టల నడుమ ఒరుసుకుంటూ, మన హృదయాల్ని ముద్దు పెట్టుకుంటూ ప్రవహిస్తుంటే, మన మనస్సుల్ని ఆ నది ప్రవాహంలో ముంచి, తేల్చి తరింపచేద్దామనుకోగా, ఆ మహానదికి అమ్మా, నాన్నా అనే ఆనకట్ట అడ్డుగా నిల్చింది. ఆ ప్రవాహ వేగాన్ని ఆటంకపర్చవద్దని కన్నీరు మున్నీరుగా ఏడ్చాను. నచ్చచెప్పాను. బ్రతిమాలాను. కాని అమ్మా, నాన్నా నాలుగు ముక్కలు చెప్పారు.

"నళినీ, ఒక్కగా నొక్కర్తెవు మిగిలావమ్మా. అక్కయ్య ఆ తీరుగా మా కడుపులో చిచ్చు పెట్టిపోయింది. ఆ వంశంలో వాళ్ళందరికీ రెండో పెళ్ళి గీత ఉందట. ఫలితం అక్కయ్య నెలదాటంగానే పోయింది. మళ్ళీ ఇంతా తెలిసి ఆ వంశంలో, ఆ కుటుంబంలో వాడేఅయిన సుందర్రావును, మా బొందిలో ప్రాణముండగా మా ఇంటి అల్లుడిగా తెచ్చుకోము. అతను కావాలో, మేం కావాలో ఆలోచించుకో. మేం చూసిన సంబంధం కూడా ఎంతో మంచిది. గొప్ప సంబంధం. అతనూ యోగ్యుడే. ప్రొబేషనరీ డిప్యూటీ తాసిల్దారు చేస్తున్నాడు. కనీసం కలెక్టరయినాచేసి రిటైరవుతాడు" అంటూ చెప్పారు. కాదంటే అమ్మ ప్రాణ త్యాగం చేస్తానంది.

ఎవరో పూర్వులు అన్నట్లు పెళ్ళిళ్ళు ఎప్పుడో స్వర్గంలోనే అవుతయ్యట.

దాని ఫలితమే నా పెళ్ళి.

ఇందులో శుభలేఖ పంపుతున్నా. ...



కోసం కాకపోయినా, ఇన్నాళ్ళూ ఈ స్నేహితురాలిగా ఉన్న ఈ అభాగ్యురాల్ని ఆశీర్వదించి, నాలుగు అక్షతలు నా నెత్తిన వెయ్యటానికయినా రమ్మని ప్రార్థిస్తున్నాను. నీ అక్షతలకోసం, నీ ఆశీర్వాదం కోసం వెయ్యి కళ్లతో చూస్తుంటాను. పెళ్లి పందిట్లో నువ్వు కనబడితే నాకు తృప్తి. తప్పక వస్తావని ఆశిస్తున్నాను.

ఏముఖం పెట్టుకుని నళిని పెళ్లికి వెళ్లాలి? నన్ను మోసగించిన పాపాత్మురాలికి మళ్ళీ నా ముఖం చూపించటమా! నన్ను ప్రేమించి, ఇంకొకరి భార్య కావటం నేను నా కళ్లతో చూడాలా? పెళ్లి కూతురుగా నా పక్కన కూర్చోవలసిన నళిని ఇంకొక వ్యక్తి పక్కన కూర్చుంటే సిగ్గులేక నేను ఆశీర్వదించటానికి వెళ్లాలా? ఇట్లా నువ్వనుకోవచ్చు. ఇంకా అనేక విధాలుగా నన్ను దూషించవచ్చు. కాని ఒక్కసారి ఆలోచించు. మనిద్దరి జీవిత విశేషాలనూ సంస్మరించుకుని ఒకర్నిచూసి మరొకరు, మనఃక్లేశాన్ని క్షాళితం చేసుకోవటానికి ఇంతకన్న మనకు అవకాశం ఎప్పుడు కలుగుతుంది? ఆరోజునుంచీ నేను పరాయి సొత్తుని, పరస్త్రీనేకదా? ప్రేమించిన యువతిని పెళ్లి చేసుకుని స్వర్గధామంలో విహరించేకన్నా, ఇంకొక వ్యక్తిని ఆమె భార్య కాబోతున్న సందర్భంలో నాలుగు అక్షతలువేసి నిండు సహృదయంతో ఆశీర్వదిస్తే, ఆ మానసిక ఆందోళన ఎలా ఉంటుందో అనుభవపూర్వకంగా తెల్సుకుందువుగాని. ఇంక నేనంటావా, మనస్సొక్కరికి అర్పించి, మనిషిని ఒకరి స్వాధీనంలో ఉంచబోతున్న నిర్భాగ్యురాలిని. అలాంటి జీవితం ఎట్లా గడపాలో నేనూ చవి చూడాలికదూ!

నళిని.

* * *

మనస్సు రాయి చేసుకుని, నళిని కోరిక మీద పెళ్లికి వెళ్లాడు. బ్రహ్మాండంగా ఎంతో అట్టహాసంగా పెళ్లి జరిగింది. అందరి హృదయాలూ, మనస్సులూ ఆనందంలో తొణికిసలాడినయ్యి. తామిద్దరి హృదయాలూ, మనస్సులుమాత్రం వ్యథతో కృంగిపోయినయ్యి.

అందరితోబాటుగా తనకూడా పురోహితుడు అక్షతలు ఇచ్చాడు, మంగళసూత్రం గుప్పెట్లో ఉంచుకుని. అందరితోబాటే అక్షతలు తీసుకున్నాడు.

# డి.సి.ఆర్. గ్రాట్యుయిటీ

మంగళ తూర్యారావములు భూనభోంతరాళాలు దద్దరిల్లేటట్లుగా మ్రోగినయ్యి. అందరితోబాటుగా తనూ అక్షతలు వేశాడు. ఇంకా సగం గింజలు చేతులోనే మిగిలినయ్యి. వాటిని మెల్లిగా ఎవరూ చూడకుండా, ఆ ఉత్తరం ఉన్న కవరులో వేశాడు.

* * *

ఈనాడు ఆ ఉత్తరంతో పాటుగానే ఆనాటి అక్షతల గింజలు కూడా కవరులోనుంచి కింద పడ్డయ్యి. కవరుసాంతం దులిపి అక్షతలన్నీ కిందపోశాడు. పిచ్చుకలు రివ్వునవచ్చి తినేసినయ్యి. అవి పదిహేనేళ్లనాటి అక్షతలు. ఆ పిచ్చుకలు ఆ అక్షతల బియ్యపు గింజల్ని తింటుంటే చిన్న పిల్లాడిలా గుబులు గుబులుగా దుఃఖం పొంగి పొర్లుకొచ్చి కన్నీరు పెట్టుకున్నాడు సుందర్రావు.

పిచ్చుకలు ఒక్కగింజా మిగల్చలేదు. ఉత్తరం కవరులోపెట్టి కవరు జేబులో పెట్టుకున్నాడు. నళిని రాసిన అన్ని ఉత్తరాలూ చించేసి ఆమె జ్ఞాపకార్థం ఆ ఆఖరి ఉత్తరం అట్టేపెట్టాడు. ఎవ్వరికీ కనబడకుండా ప్రాణపదంగా ఈ పదిహేనేళ్ళూ దాచాడు. నేటికి ఆ ఉత్తరాన్ని జేబులో పెట్టుకున్నాడు.

* * *

మర్నాడు ఆఫీసుకు వెళ్లగానే మోహన్‌రావు పిల్చాడు సుందరావుని. అతను వెళ్లాడు. "ఇదుగోనోయ్ గ్రాట్యుయిటీ శాంక్షను చేశాను. టైపు చేయించి ఇవ్వాళే ఆర్డర్లు పంపించు" అంటూ బరువెక్కిన హృదయంతో ఫైలు ఇచ్చాడు. మోహన్‌రావు అంతకన్న బరువెక్కిన హృదయంతో, మనఃక్లేశంతో ఫైలు తీసుకున్నాడు సూపరింటెండెంట్ సుందర్రావు.



"ప్రేమలేఖ మీకు రాస్తే అది మా నాన్న కిచ్చారేవండీ?"

మోహనరావు ఎకౌంటెంట్ జనరల్ ఆఫీసులో అసిస్టెంటు ఎకౌంట్స్ ఆఫీసరు. అదే ఆఫీసులో సుందర్రావు సూపరింటెండెంటు. ఇద్దరికీ పెన్షన్లూ, గ్రాట్యుయిటీలూ చూసే సెక్షను.

ఆరోజునే ఆర్డర్లు అంటే "డెత్—కం—రిటైర్‌మెంట్ — గ్రాట్యుయిటీ" ఆర్డర్లు డిస్పాచ్ చేయించాడు సుందర్రావు.

ఇరువురి హృదయాలూ అవ్యక్త వ్యథలతో తేలిక పడినయ్యి. తమ తమ బాధ్యతలు అంతటితో తీరినవనుకున్నారు. ఎవరికి వారు.

ఆరోజు ఆదివారం. సాయంత్రం నాలుగ్గంటలయింది. హిమాయత్‌నగర్‌లో ఒక యింటిముందు జనం గుమికూడిఉన్నారు.

"ఇద్దరు పిల్లల తల్లి. భర్తపోయి మూడు నెల్లయింది. ఆయన తాసిల్దారుచేస్తూ, మూడు నెలల క్రితమే చనిపోయాడు. ఆయన పేరు ఆనందరావుగారు. భర్త తాలూకు గ్రాట్యుయిటీ డబ్బు దాదాపు నాలుగు వేలు శాంక్షను చేసినట్లుగా గవర్నమెంటునుంచీ నిన్ననే ఆర్డర్లు వచ్చినయ్యి. ఆడబ్బు ఆవిడ చేతికి రాకుండానే ఇవ్వాళ హఠాత్తుగా పోయింది. ఏమిటో పాపం. ఆ ఇద్దరు పిల్లలకూ ఇంక దిక్కెవరో" అంటున్నారు అక్కడ మూగిన జనంలో ఒకరు.

దగ్గరగా నిల్చుని శవాన్ని చూస్తున్న సుందర్రావు కంట తడిపెట్టి కళ్లు తుడుచుకున్నాడు. ఆ పోయిన నావిడకు దగ్గరబంధువు కామోలనుకుంటున్నారు అంతా. అంతలో అతని భుజంమీద చెయ్యి పడింది. వెనక్కు తిరిగి చూశాడు. అసిస్టెంట్ ఎకౌంట్సు ఆఫీసరు మోహన్‌రావు, తనూ కళ్లొత్తుకుంటూ నిల్చున్నాడు శవాన్నిచూస్తూ.

దహన సంస్కారాలకి ఏర్పాట్లన్నీ బంధువులు చేస్తున్నారు. చేరువలోఉన్న ఆమె పిల్లల్ని పిల్చాడు సుందర్రావు.

"మీపేరేమిటేబాబూ"

"నాపేరు సుందర్రావు. తమ్ముడుపేరు మోహన్‌రావు. మా అమ్మపేరునళిని. ఈవాళే చచ్చిపోయింది" అన్నాడు పెద్దవాడు ఏడుస్తూ. ●

# మీ జుత్తును ఆరోగ్యంగా నిగనిగలాడేలాగు వుంచుతుంది

# బ్రిల్‌క్రీమ్

సర్వోత్తమ హేర్-డ్రెస్సింగ్




## కేవలం బ్రిల్‌క్రీమ్ మాత్రమే

చక్కగా జుత్తు దువ్వుకొనడానికి సాయపడుతుంది. జుత్తు జిడ్డు కాదు. చెదరి పోదు.

- చాలా పొదుపు అయినది, ఒక్కసారి రాస్తే చాలు రోజంతా జుత్తు రేగదు.
- దీనిలో చేర్చిన అద్వితీయమైన మిశ్రమము మాడును పోషించి, జుత్తును బాగా పెంచుతుంది.
- మీ జుత్తు యొక్క సహజ రంగును బయట పరచును.

**మీరు కూడా బ్రిల్‌క్రీమ్ ఉపయోగించడం మొదలు పెట్టండి**

**ప్రపంచమంతటా లక్షలాది మంది సొగసుకారులు ఉపయోగించేది.**

B/P/TLP/1/65 TL




సబ్ కలెక్టర్ ఆఫీసు అంతా చాలా హడావిడిగావుంది. సబ్ కలెక్టర్ రఘురామయ్యగారు ఛార్జి ఇచ్చేయడానికి సన్నాహాల్లో మునిగిపోయివున్నారు. ఈలోగా స్వింగ్‌డోర్స్ తెరుచుకుని తహశీల్దారు హనుమంతరావు లోపలికొచ్చాడు.

"కమాన్ హనుమంతరావు! కూర్చో!" అతన్ని చూడగానే మందహాసంచేస్తూ అన్నారు రఘురామయ్యగారు. "నిజంగా అదృష్టవంతుడవోయ్! నువ్విక్కడికి తహశీల్దారుగా రావడం, మీ అబ్బాయి నీపైన సబ్ కలెక్టరుగా రావడం.....తనకంటేఉన్నత స్థాయిలో ఉన్న కొడుకునుచూస్తే ఏతండ్రి మురిసిపోడు?" రిటైర్ కాబోతున్న సబ్ కలెక్టర్ కావడంతో, ఆయన అందర్నీ ఏకవచనంలోనే సంబోధిస్తాడు.

పొంగిపోతున్న తన సంతోషాన్ని చిరునవ్వు చాటున బలవంతంగా అణచివేస్తూ, "అంతా మీబోటి పెద్దల ఆశీర్వాదం సార్!" అన్నాడు హనుమంతరావు.

ఆతర్వాత కాసేపు పిచ్చాపాటీ సాగింది.

హెడ్ క్లర్కు మాధవరావు లోపలి కొచ్చాడు. అతని వెనకాలే లోపలి కొచ్చాడొక యువకుడు. చాకులాంటి మనిషి. అయిదడుగుల పది అంగుళాల పొడుగు. పొడుగుకుతగ్గ

## రవి

శరీర సౌష్టవం, చామనఛాయతో మంచి కళ ఉన్న ముఖం! అతనే ఎం. చంద్రశేఖర్, ఐ. ఏ. ఎస్. సబ్ కలెక్టర్!

అతను లోపలికొస్తూనే "గుడ్‌మార్నింగ్ సార్!" అనాడు.

"రావోయ్ చంద్రశేఖర్! సిడవున్!...... మై—డి—మై మీట్ మిస్టర్ ఎం. వి. హనుమంతరావ్, ఎం. ఏ. తహశీల్దార్!" అన్నారు రఘురామయ్యగారు ఛలోక్తిగా. అందరూ హాయిగా నవ్వుకున్నారు.

మరో అరగంటలో పార్టీ రెడీ అని కబురొచ్చింది. అందరూ లేచి హాల్లోకివెళ్ళారు. ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి అయాక ఒక్కొక్కరే లేచి మాట్లాడ్డం మొదలెట్టారు.

ఆ మాట లేవీ హనుమంతరావుకు వినిపించడంలేదు. 'తన కొడుకే తనపైన సబ్ కలెక్టర్‌గా రావడం—చాల అదృష్టం! ఇక తనకు హాయిగా గడిచిపోతుంది! తనకు ఇక నుండీ రిటర్న్ పంపలేదని, కలెక్షన్ బాగా లేదని, ఆఫీసు పనిలో ఆలస్యం అవుతోందని, ఝాడింపులురావు! తక్కిన తహశీల్దార్లు ఏడుస్తారు—పాపం!'......పదిహేను సంవత్సరాలు రెవెన్యూలో పని చేసిన అతని మెదడు, అదే ఒరవడిలో ఆలోచిస్తోంది! తోటి ఆఫీసర్లపైన అతనికి జాలి కూడా కల్గింది!

'......ఈ సబ్ కలెక్టర్ అండ చూసుకుని తనను లెక్కచెయ్యని ఆ దేవపాలెం కరణం మునసబులు ఇప్పుడు తానంటే వణికిపోతారు ! అవసరం అయితే చంద్రంచేత వాళ్ళకి చివాట్లు కూడా వేయిస్తేసరి!' చంద్రశేఖర్ మాటలు విని తన వూహాసరళిని ఆపుజేసి, ఈ లోకంలోకి వచ్చాడు హనుమంతరావు.

"......ప్రెంటిస్ సబ్ కలెక్టర్‌గా ఈ తాలూకాతోసహా అయిదారుచోట్ల పని చేశాను. ఇన్నాళ్ళలోనూ నాకు కల్గిన అభిప్రాయం ఏమిటంటే— రొటీన్‌వర్క్‌కి మాత్రం భంగం రావలసిన అవసరం లేదని! కష్టసుఖాలు నాకూ తెలుసు! రొటీన్‌వర్క్ మాత్రం స్ట్రిక్ట్‌గా చూడదల్చుకున్నాను! ఈ విషయంలోమాత్రం అందర్నీ సహకరించవలసిందిగా కోరుతున్నాను!......" ఆ 'కోరిక' వెనుకఉన్న హెచ్చరిక అందరితోబాటు గ్రహించిన హనుమంతరావు ఉలిక్కిపడి, అంతలోనే తనకు కాదన్నట్లు సర్దుకున్నాడు.

"......నా పరోక్షంలోను, ప్రత్యక్షంలోను కొందరు వెలిబుచ్చిన అభిప్రాయం, నాకు పక్షపాతం ఉండడానికి అవకాశం ఉందని!......" అంటూ తండ్రికేసి ఓరగా చూశాడు చంద్రశేఖర్! రఘురామయ్యగారు ఈ

ఈమాట ఎత్తినందుకు అభినందన సూచకంగా చిరునవ్వు నవ్వారు.

"......పొరబాటు చేసినప్పుడుగాని, చేయనప్పుడుగాని, నాకు తండ్రీ, కొడుకు అనే విచక్షణలేదు! ప్రభుత్వ సేవకునిగాను, ప్రజా సేవకునిగాను, నా విధిని నేను నిర్వర్తించి తీరుతానని మనవి చేస్తున్నాను!" అని ముగించాడు చంద్రశేఖర్. చివరి మాటల్లో అతని దృఢ సంకల్పమంతా ధ్వనించింది. హనుమంతరావుకు మనసులో ఏదో కలుక్కుమన్నా, అది కరతాళ ధ్వనులమధ్య అణగిపోయింది!

ఆ తర్వాత రిటైరై వెళ్ళిపోతున్న సబ్ కలెక్టర్‌గారికి వీడ్కోలు చెప్పారు. "...అందరు ప్రజలకూ చదవడానికి అర్హత కలది—భగవద్గీత! ఈ వృద్ధాప్యంలో శ్రీ రఘురామయ్యగారికి అండగా ఉండేందుకు శ్రీమద్భగవద్గీత, ఒక చేతికర్ర సమర్పిస్తున్నాను!" అన్నాడు చంద్రశేఖర్!

పార్టీ ముగిసింది. అందరూ సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

రోజులు గడిచిపోతున్నాయి.

ఒకరోజున టపా విప్పిన హనుమంతరావు నిశ్చేష్టుడైపోయాడు. "టు ఆల్ తహసీల్దార్స్" అని, లాండ్ రెవెన్యూ రిటర్న్స్ పంపలేదని రిమైండర్!! అందరితోబాటు తానూ ఒకడయ్యాడు!!!

రెండు నెల్నుంచి లాండ్ రెవెన్యూ సీట్ ఖాళీగా ఉంది. ఇంతకుముందయితే, సబ్ కలెక్టర్ ఏమంటాడో ఏమోనని భయంతో మరో గుమాస్తాచేత వేయించి పంపేవాడు. ఈసారి, "ఆ! చూద్దాంలే!" అనుకుని వూరుకున్నాడు. కాని, ఇప్పుడు......ఇది......

'...రొటీన్‌వర్కు ప్రిస్క్రిప్టుగా చూస్తాను!' చంద్రశేఖర్ మాటలు చెవుల్లో గింగురుమన్నాయ్! ఉక్రోషమంతా చూపిస్తూ బెల్ గట్టిగా కొట్టాడు హనుమంతరావు. ప్యూన్‌తో 'కరెక్ట్ వెంకటరత్నా'న్ని పిలవమన్నాడు. రిటర్న్స్ తాలూకు పని పూర్తి చేయించి ఆరోజు టపాలోనే పంపేశాడు.

ఇటువంటి పొరపాటే మరో మూడు నాలుగు జరిగాయ్! హనుమంతరావు లోలోపల బాధపడ్డాడేగాని బయటికి పొక్కలేదు! అయితే ఆవేశం మాత్రం లోపల సెగలు వేస్తూనేఉంది!

జమాబందీ దగ్గర పడుతోంది. ప్రోగ్రాం హనుమంతరావే, పాత ప్రోగ్రాంను అనుసరించివేశాడు. సబ్ కలెక్టర్ అప్రూవ్ చేసేశాడు.

నాలుగు రోజుల తర్వాత, మొదటిరోజు ప్రోగ్రాం తాలూకా కరణం ఒకతను వచ్చాడు. హనుమంతరావు దగ్గరికి.

"మావాడికి సీరియస్‌గా ఉందిసార్! ఆపరేషన్ అవసరం అంటున్నారు అమెరికన్ హాస్పిటల్ డాక్టరుగారు! ఇట్లాంటప్పుడు మొదటిరోజువేస్తే నేను రాలేనుసార్!" అన్నాడు ఆ కరణం. హనుమంతరావు ససేమిరా అంగీకరించలేదు. "ఇటువంటి సాకులు ఎన్నిసార్లు విన్నానంటావ్! అదేం కుదరదు! అక్కౌంట్సు ఇచ్చేయాల్సిందే!" అన్నాడు.

ఆ కరణానికి బాధ, కోపం రెండూ వచ్చాయి. సబ్ కలెక్టరుగారి దగ్గరికి వెళ్ళి చెప్పుకున్నాడు. "నాన్నగార్ని అడిగితే, కట్టుకథలే పొమ్మన్నారు. మీరు కూడా నమ్మకపోతే హాస్పిటల్‌లోఉన్న పిల్లవాడిని తీసుకురావాలి! ఇక మీ దయసార్!" అన్నాడతను దీనంగా!

చంద్రశేఖర్‌కి అతన్నిచూస్తే అబద్ధం చెబుతున్నట్లు అనిపించలేదు! కాసేపు బయట ఉండమని, ఫిర్కా రెవిన్యూ ఇన్‌స్పెక్టర్‌కి కబురు చేశాడు. "నిజమేసార్! ఆ సంగతి నాకు తెలిసే, అతన్ని తహశీల్దారుగారి దగ్గరకు వెళ్ళమన్నాను!" అన్నాడు రెవెన్యూ ఇన్‌స్పెక్టర్.

వెంటనే ప్రోగ్రాం మార్చి, ఆ ఫిర్కా ఆఖరి రోజు వేశాడు చంద్రశేఖర్. ఆ సంగతి, సంతోషంగా చెబుతున్న ఆకరణం నోటవెంటవిన్న హనుమంతరావుకు మతిపోయినట్లయింది! తేరుకున్న తర్వాత, అవమానం, అభిమానం, కోపం అతడి మనస్సులో స్వైరవిహారం చేయడం మొదలెట్టాయ్!

ఆరోజు సాయంత్రం ఇక నిగ్రహించలేకపోయాడు! తన గదిలోకి వెళ్ళిపోతున్న చంద్రశేఖర్‌ని పిలిచాడు. 'పిలిచారా నాన్నా!' అంటూ గదిలోకి వచ్చాడు చంద్రశేఖర్.

గుమ్మంలోంచి, హుందాగా లోపలికొస్తున్న 'చంద్రశేఖర్, ఐ. ఏ. ఎస్.'ని చూసి, ఒక్క క్షణం ఉప్పొంగిపోయాడు ఆ తండ్రి! అయితే, ఆ ఆనందం ఒక్క క్షణం మాత్రమే! ఉత్తర క్షణంలో కోపం మెదిలింది. మంద్ర స్వరంలో అడిగాడు, "చంద్రం! ప్రసాదంపాడు జమా బందీ తేదీ మార్చావుటగా!"

"అవున్నాన్నా! పాపం అతన్నిచూస్తే జాలేసింది! పిటీయబుల్ పొజిషన్!" అన్నాడు చంద్రశేఖర్. సానుభూతి ధ్వనించే కంఠంతో!

"అతను నన్ను అడిగాడు. నిన్నే ఇదీ— ప్రోగ్రాం పంతకం అయిపోయిందన్నాను! నువ్వు ప్రోగ్రాం మార్చగానే వాళ్లేమనుకున్నారో తెలుసా? 'తహశీల్దారు మాటకి అతని కొడుకుదగ్గరే విలువలేకపోయిం' దన్నారు. తలకొట్టేసినట్లయింది! పిటీయబుల్ పొజిషన్‌లో పడినది నేను!.....నేను తలవంచుకొనేటట్లు చేశావురా!" అన్నాడు హనుమంతరావు—బాధగా!

చంద్రశేఖర్ ఆశ్చర్యంతో రాయిలా నిలబడిపోయాడు! ఇదా—తండ్రి బాధ? ఇంతవరకూ ఆయనకు అధికారంలేదు కాబట్టి కాదన్నాడని అనుకుంటున్నాడు తను! జాలిపడవలసినచోట జాలిపడకపోగా, తను జాలి చూపితేనేరం ఎంచుతున్నాడు! చంద్రశేఖర్‌కి ఒక విధమైన అసహ్యం కల్గింది. అయినా దాన్ని అణిచిపెట్టి, "దానిదేముందినాన్నా! నీకు జాలివేసినా నీ చేతుల్లో లేదు గనుక ఏమీ చెయ్యలేకపోయావ్! నువ్వు చెయ్యాలనుకున్నవనిని, నాకు అధికారం ఉంది గనుక చేశాను! దీనికి బాధపడడం దేనికి?" అన్నాడు సాఫీగా. సమాధానానికి ఎదురు చూడకుండా బయటికి వెళ్ళిపోయాడు.

హనుమంతరావు మనస్సు 'భగ్గు'మంది! 'నీకు జాలి ఏకోశానాలేదు సుమా!'—అని ఎత్తి పొడుపా ఇది? గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించిందన్నట్లు!......ఉడికిపోయాడు హనుమంతరావు!

ఇంతకోపంలోనూ అతనిలో భయం మొలకెత్తింది! ఇంత జాలి, నీతి పెట్టైరా ఉన్నవాడు, జమాబందీలో ఎంత అల్లరి చేస్తాడో? ఎక్కడెక్కడ ఎన్ని గొడవలవుతాయో!

అయితే అతను అనుకున్నట్లు అల్లరేమీ జరగలేదు. సాధారణంగా జరిగేవాటి నన్నింటినీ చూసీ చూడనట్లు వదిలేశాడు చంద్రశేఖర్. కాని, ఒక్కటి మాత్రం జరిగింది.

అడంగలలో తహశీల్దారు తప్పువ్రాశాడు. రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ రిమార్కు ఒకటయితే తహశీల్దారు రిమార్కు మరొకటయింది! ఆ అడంగలు చెక్‌చేస్తూ, 'చీకటి పడింది—రేపు చూద్దాంలే' అన్నాడు చంద్రశేఖర్!

ఈ రిమార్కుల్లో తహశీల్దారు వ్రాసింది పొరపాటు. కేవలం పొరబాటున జరిగిందది!

ఆ తర్వాత ఎంతమంది చెక్ చేసినా ఎవరూ గమనించలేదు! ఆర్నాల రెవెన్యూ ఇన్‌స్పెక్టర్‌ని, తహశీల్దార్‌ని, కరణాన్ని పిలిపించాడు చంద్రశేఖర్. "ఏది నిజమో తేల్చా

# తండ్రి

అంటే, అక్కడికివెళ్ళి చూడాల్సిందే" అన్నాడతను.

"ఆ రిమార్కు పొరబాటున పడిందిరా! సరిజేస్తే సరి!". అన్నాడు హనుమంతరావు. చంద్రశేఖర్ ఒప్పుకోలేదు. ఇప్పుడు సరి చేయడ మేమిటన్నాడు. ఆ కరణం, రెవెన్యూ ఇన్‌స్పెక్టర్, తహశీల్దార్—ముగ్గురూ కలిసి తప్పుడు రిమార్కు వ్రాసినందువల్ల ఎవ్వరికీ లాభించేది కాదనీ, అంతకుముందు సర్వే నెంబరుకి వేసిన రిమార్కే మళ్ళీ 'రిపీట్' అయిందనీ, గంటసేపు చెప్పారు. చివరికి చంద్రశేఖర్‌కి నచ్చజెప్పేసరికి దేవతలు కనిపించారు! కేవలం చేతి పొరబాటేనని నిర్ధారణ చేసుకుని, సరిజేయడానికి ఒప్పుకున్నాడు చంద్రశేఖర్!

'తన పొరబాటు—కేవలం పొరబాటుని—సరి చేయడానికి కొడుకుని గంటసేపు బతిమాలవలసి వచ్చింది! ఎంత అవమానం!!" ఆ రాత్రి హనుమంతరావులో క్రోధం, అభిమానం విశృంఖలంగా చెలరేగాయ్!

తన కొడుకు తన పై పదవిలో ఉండి, తనను ఉద్ధరించేదిపోయి, పదిమందిలో అవమానిస్తున్నాడు! నవ్వులపాలు చేస్తున్నాడు! ఏమిటీ ఖర్మ!!

ప్రక్కగదిలోంచి భారతీ చంద్రశేఖర్‌ల నవ్వులు వినిపించాయి. పగలబడి నవ్వుకుంటున్నారు! అసలే ఆవేశంలో వక్రమార్గం పట్టిన అతని మనస్సు దీన్ని పూర్తిగా అపార్థం చేసుకుంది! తన అవమానాన్ని చెప్పుకునే నవ్వుకుంటున్నారు! తనని గురించే!!

కుత కుతలాడిపోతున్న అతని మనసులో ఒక ఆలోచన మెరపులా మెరిసింది! అంతే!! దాని పూర్వాపరాలు ఆలోచించుకున్నాడు. ప్లాన్ కూడా సిద్ధం చేసుకున్నాడు! ఫలితం వూహించుకొంటే....అతని మనస్సు తేలిక పడిపోయింది!

జమాబందీ అయిన తర్వాత మూడు రోజులు సెలవుపెట్టి, హైదరాబాద్ వెళ్ళి వచ్చాడు హనుమంతరావు

పదిహేనురోజులు తిరక్కుండానే ఆర్డర్స్ వచ్చాయి! చంద్రశేఖర్‌ని ట్రాన్స్‌ఫర్ చేశారు! ఆరు నెలలయినా కాకుండానే వచ్చిన ఈ ట్రాన్స్‌ఫర్‌ని చూసి చంద్రశేఖర్ తికమక పడిపోయాడు!

రెండోరోజున కలెక్టర్‌వద్దనుంచి ట్రంక్ కాల్‌వచ్చింది. అది వినగానే చంద్రశేఖర్‌నోటి వెంట మాటరాలేదు! నిశ్చేష్టుడై పోయాడు!

"...మిస్టర్ శేఖర్! తండ్రి కొడుకుని గురించి మంచి చెబితే నమ్మరుగాని, చెడుగా చెబితేమాత్రం వెనకా ముందూ చూడకుండా నమ్మేస్తారు— సహజంగా! ఆ సాధారణ మనస్తత్వాన్ని మీనాన్నగారు బాగా ఉపయోగించుకున్నారు.... ..."

ఇంటికి రాగానే తల్లితోనూ, భారతితోనూ చెప్పాడు. చంద్రశేఖర్ మాటలు, అతనిముఖం చూసిన అిద్దరికీ అపరిమితమైన జాలి, హనుమంతరావుపైన అసహ్యం కలిగాయి!

అప్పుడే లోపలి కొచ్చాడు హనుమంతరావు. తనకేసి అసహ్యంగా చూస్తున్న కొడుకుకేసి చూసి, ముసి ముసినవ్వులు నవ్వుకుంటూ లోపలి కెళ్ళిపోయాడు— తహశీ










# మౌల్వీ నసిరుద్దీన్ - కథలు

* మహీధర్ నళినీ మోహన్

ఒకరోజున తైమూర్‌కి ఒక రైతు మీద ఎందుకో విపరీతమైన కోపం వచ్చింది. పక్కనున్న మౌల్వీతో "వీడిని నూరు కొరడా దెబ్బలు కొట్టించు" అని పురమాయించేడు.

ఆ ఆజ్ఞ విని మౌల్వీ చిరునవ్వు నవ్వేడు. ఆ నవ్వుచూస్తే తైమూర్‌కి మరింత కోపం వచ్చింది.

"ఏమిటా వెకిలి నవ్వు. వెళ్ళు నూరు కాదు, అయిదు వందల దెబ్బలు కొట్టించు" అంటూంటే మౌల్వీకి ఇంకా నవ్వు వచ్చింది. ఆ నవ్వు చూస్తుంటే రాజుకు మరీ తామసం పెరుగుతూంది. ఆ కోపంతో రైతును కొట్టవలసిన దెబ్బల సంఖ్య వెయ్యికి పెంచేడు.

ఆ సంఖ్య వినేసరికి మౌల్వీ పక్కలు పట్టుకు నవ్వేడు.

తైమూర్ ఉగ్రంగా లేచేడు.

"ఏమిటా బేహద్బ్. నన్నుచూసీ, నా ఆజ్ఞలు వినీ నవ్వేపాటివాడివయ్యే వేం?"—అన్నాడు.

మౌల్వీ నవ్వు ఆపుకొన్నాడు.

"ఎంతమాట. ఎంతమాట. దేవరి వెయ్యేళ్ళు వర్ధిల్లాలి. తమను చూచి నవ్వగలననే అంటారు? లేదు. అల్లా తెలివిచూస్తే నవ్వు ఒచ్చింది. 'కొరడా దెబ్బలు అంటే ఏమిటో, అసలు అంకెలు అంటే ఏమిటో తెలియని వాడిని ప్రభువుని చేసేడే అల్లా' అని పించి నవ్వు వచ్చింది. వెయ్యి మాటల్లా వుంచి, వంద కొరడా దెబ్బలు తినేటం దుకు మనిషి బ్రతికి ఉంటాడా?"

★




ఆ ఊళ్ళోని ఒక పెద్ద ఉద్యోగి మౌల్వీ నసీరుద్దీన్ అంటే మంట ఆయనను చిన్నపుచ్చాలనీ, అవమానించ అనీ ఎంతో కోరిక. కాని సాధ్యపడడ లేదు. నసీరుద్దీన్ మాట మీద ఉంచ కోడు. పలకరిస్తే ఏం పీకకు త లిస్తాడో అనే భయమాయె.

కాని, ఒకనాడు మంచి అవకాశ దొరికినట్లే అనిపించింది.

ఉన్నట్లుండి మౌల్వీగారి గాడిద చ

పోయింది. మౌల్వీకి అది పెద్ద దెబ్బ. ఆ విచారాన్ని మౌనంగానే భరించేడు.

ఆ వార్త ఆ ఉద్యోగికి తెలిసింది. మౌల్వీని అవమానించడానికి మంచి అవకాశం దొరికిందనుకొన్నాడు. ఆయనను పిలిపించేడు.

మౌల్వీ రాగానే ఎంతో అభిమానమూ ప్రేమా కనబరుస్తూ విచారం ప్రకటించేడు.

"అయ్యా! మౌల్వీగారూ! తమకు చాల పెద్ద ఆపద వచ్చిపడిందని విన్నాను. మీకు అత్యంత ప్రియ బాంధవుడైన గాడిద చనిపోయిందని తెలిసింది. ఈ వయస్సులో మీకు కలగవలసిన కష్టం కాదనుకోండి......"



మౌల్వీ ఆ అధికారి ధోరణిని గ్రహించేడు. తనను చిన్నపుచ్చాలనే ఆయన ప్రయత్నం అని తెలిసింది. కాని ఆ అభిప్రాయాన్ని పైకి తెలియనీయలేదు.

"చిత్తం. తమరు అన్నది నిజం. ఆ గాడిద అంటే నాకెంతో ఇది. నాకు గుర్రమయినా, ఏనుగయినా, స్నేహితుడయినా అదే అనుకున్నాను. స్నేహం దృష్ట్యా మీకన్న ఎక్కువవడానికి లేదు గాని ఏమిటో ఆ వెర్రి అభిమానం అల్లా అనిపిస్తుంది. దానికీ నేనంటే అంత అభిమానమూ వుంది...." అంటూ ఏడ్పు ముఖం పెట్టేడు.

తనకే ఎదురు తిరుగుతుందని ఆ ఉద్యోగి గ్రహించేడు. ఎల్లాగో బయటపడాలి. వీలయితే అవమానమూ చేయాలి.

"పాపం. అనవసరంగా విచారించకండి. ఎవ్వరూ ఈ భూమిమీద కలకాలం వుండిపోరు. ఈవేళ ఆ గాడిద. రేపు మరొకరు. మీరో....."

చటుక్కున మౌల్వీ ఆ అధికారిని కావిలేసుకున్నాడు.

"వద్దు. అంతమాట అనుకోవద్దు. అల్లా నా గాడిదను నడి వయస్సులో తీసుకుపోయేడు. కనీసం తమరేనా బాగుండి, అది పోయిన లోటు తీర్చాలని ప్రార్థిస్తున్నా. అంతా ఆయన దయ" అన్నాడు. ●

# పుస్తకాలు

## సమగ్ర ఆంధ్ర సాహిత్యం

ఏడవ సంపుటం. మలిరాయలయుగం. ఆరుద్ర రచన. క్రౌను 264 పుటలు. వెల: అయిదు రూపాయలు. ప్రకాశకులు యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, మచిలీపట్టణము, సికింద్రాబాదు.

ఆంధ్రసాహిత్యాన్ని గూర్చి అపూర్వంగా పరిశోధనలు సాగించిన ఆరుద్రగారు కూర్చిన సంపుటాల్లో ఇది సప్తమం. కృష్ణదేవరాయల తండ్రి నరసరాయలు మొదలు తమ్ముడు అచ్యుత దేవరాయలవరకూ వున్న కాలాన్ని ఒకయుగంగా విభజించి రచయిత అందరి కవులనూ, వారి రచనలనూ గూర్చి వ్రాశారు. ఇదివరలో వెలువడిన సంపుటాలలో కంటె ఇందులో చాలా ఎక్కువమంది కవులను గురించిన వివరణ పధ్నాలుగు అధ్యాయాలలో ఉన్నది.

తొలుత కొరవి గోపరాజు సింహాసనద్వాత్రింశికను గురించి చక్కగా వివరించ బడింది. విషయాన్ని విసుగు కలక్కుండా చెప్పడం ఒక విశేషమే! మాదయ కవి రచించిన మైరావణ చరిత్రలోని కథాంశమూ, దాసివారి స్త్రీలనుగురించిన వర్ణనమూ, కవి, ఎర్రన శ్రీ నాథులను అనుసరించిన ఘట్టాలూ చక్కగా చూపబడినవి.

ఈ సంపుటంలో శ్రీ కృష్ణదేవరాయలనుగురించే ఎక్కువగా కానవస్తున్నది. రాయల జననకాలాన్ని గురించిన ఆరుద్రగారి పరిశీలన మెచ్చదగినది. రాయల నిర్యాణసమయానికి అళియ రామరాయలు 85 సంవత్సరాల వృద్ధని ప్రసిద్ధి. అతని వయస్సు ననుసరించి కృష్ణదేవరాయలు అవసాన సమయానికి వృద్ధుడై వుండాలనీ, అందువల్ల జననకాలం యింకా వెనక్కు వెళ్ళవచ్చుననీ కొందరు చరిత్ర విమర్శకుల అభిప్రాయం. అంచేత యింకా యీ విషయంలో పరిశోధన జరగవలసే వున్నది. ఈ అధ్యాయంలో రాయల రాజనీతిపద్ధతి, జీవిత విశేషాలు, రచనా పాటవం, విష్ణుచిత్తీయంలోని విశేషవిషయాలు, ఆముక్తమాల్యదా కర్తృత్వం మొదలైన విషయాలు చాలా చక్కగా చూపబడ్డాయి.

రాయలనుగురించి వ్రాసినట్లే నందితిమ్మన్న పారిజాతాపహరణాన్ని గురించీ, చరిగొండధర్మన్న చిత్రభారతాన్ని గురించీ, నాదెండ్ల గోపమంత్రి గయోపాఖ్యానాన్నిగురించీ ఆరుద్రగారు విపులంగా వ్రాశారు. తిమ్మన, ధర్మనల పారిజాతాపహరణ వృత్తాంతాల భేదాన్నీ, గయోపాఖ్యాన, చిత్రభారతాల పోలికలనూ చక్కగా చూపారు. అల్లసాని పెద్దనగారికి రాయల వారితో కలిగిన పరిచయం చక్కగా ఊహించబడింది. పెద్దన రచనావైశిష్ట్యం ప్రశంసించబడినది.

అష్టదిగ్గజాల నిర్ణయంలో అభిప్రాయ భేదాలున్నవి. ఎవ్వరెవ్వరి అభిప్రాయాలు ఏవిధంగా ఉన్నాయో పట్టికతో సహా రచయిత చూపారు. అందరి మతంలోనూ తిమ్మన, పెద్దన, ధూర్జటి, తెనాలి రామకృష్ణులు నిశ్చయంగా దిగ్గజాలలో చేరి వున్నారు. ఇందులో ధూర్జటిని గురించిన అధ్యాయంలో ఆకాలానికి ధూర్జటీ, తెనాలికవీ యువకులనీ, సానివాడలో తిరుగుతూ వుండేవారనీ వీరి కవిత్వానికి మెచ్చుకొని రాయలవారు వీరిద్దరినీ అష్టదిగ్గజాలలో చేర్చారనీ ఉన్నది. ధూర్జటిని గురించి వున్న యీ సంపుటంలోనే తెనాలికవిని గురించికూడా చేర్చడం ఉచితంగా ఉండేది. తమరచనలను రాయలకు కృతి యివ్వకపోవడంలో యిద్దరూ సమానులేకదా!

చింతలపూడి ఎల్లన్నను గురించి వ్రాసినప్పుడు అతని రాధా మాధవానికీ, విష్ణుమాయా నాటకానికీ వున్న పోలికలుచూపి, ఆరుద్రగారు విష్ణుమాయా నాటకం మడికి అనంతయ్య రచన అనే ఆంధ్రకవితరంగిణీకారుని అభిప్రాయాన్ని బలహీనం చేశారు. ఆరుద్రగారిచ్చిన ఉపపత్తులు బాగా ఉన్నవి. అయినా తాము దేనినీ నిర్ణయించక యీ నిర్ణయాన్ని భావి పరిశోధకులకే విడిచిపెట్టడం ఆయన సహృదయతకు తార్కాణంగా ఉన్నది.

శైవ మతానికి ఆవలంబనాన్ని యిచ్చిన పిడుపర్తి కవులను గురించీన్నీ, వైష్ణవమతానికి పుష్టిని కలిగించిన తాళ్ళపాక కవులనుగురించీ సంగ్రహంగా అయినా మంచి విషయాలు అందించబడినవి. ఈ పద్ధతి వాఙ్మయంతో మతాన్ని జోడించి పరిశోధించే వారికి బాగా ఉపయోగిస్తుంది.

చివరి అధ్యాయంలో పదముగ్గురు కవులను గురించిన విషయాలు ఉన్నవి. అముద్రితంగా ఉన్న యాదవామాత్యుని విక్రమార్క చరిత్ర మున్నగు వాటివివరాలు వాఙ్మయాభిమానులకు చాలా ఉపయోగించ గలవు.

—ఆంగీరస

## ఖడ్గతిక్కన

పద్య కావ్యము. రచన: శ్రీ కార్యమపూడి నాగభూషణము. 54 పేజీలు. మూల్యం: రు.1—25 పై. ప్రాప్తిస్థానం: పున్నవ పారిసర్వోత్తమరావు, హెడ్‌మాస్టరు, జిల్లా పరిషత్ హైస్కూలు, పలపర్రు.

ఆదినుంచి ఆంధ్రదేశం వీరాధివీరులకు, సత్కవులకు, కళాకారులకు, వీరనారీమణులకు పేరెన్నికగన్నది. మహాభారతమును పదునేను పర్వము లాంధ్రీకరించిన కవిబ్రహ్మ తిక్కన పెదతండ్రి కుమారుడు అఖండ శౌర్యరాసియయిన ఖడ్గతిక్కన. మనుమసిద్ధికి, కాటమరాజుకు జరిగిన యుద్ధంలో మొదటిసారి నోపగింపబడి తిరిగివచ్చిన తిక్కనలో పౌరుషాగ్నిని రగుల్కొల్పజేయటానికి తల్లి దండ్రులు, భార్య అతన్ని అవమానిస్తారు. ఖడ్గతిక్కన ఆ అవమాన భారంతో కృంగిపోయినా, పారిపోయి వచ్చిన తననువారు పరాభవించటంలో తప్పులేదని, మరునాటి యుద్ధ రంగంలో స్వైర విహారం చేసి వీర మరణం పొందుతాడు. వీరపత్ని చానమ్మ అతనితో సహగమనం చేస్తుంది వీరోచితమైన ఈ గాథను రచయిత చక్కగా పద్య రూపంలో వివరించారు. పద్య రచన సొంపుగా, సాఫీగా నడచింది. ఈ కావ్యము సాహితీ రసజ్ఞుల అభిమానాన్ని చూరగొంటుందని ఆశించవచ్చు

## పెళ్ళి పందిరి

రచయిత. శ్రీ సీతంరాజు వెంకటేశ్వరరావు. క్రౌను 112 పేజీలు, వెల రెండురూపాయలు. ప్రాప్తిస్థానం: సర్వోదయ పబ్లిషర్స్, విజయవాడ—2.

నాటక రచయిత యింతకుపూర్వం నాటకాల్నీ, నవలల్నీ వ్రాసినవారే. క్రొత్తతరహా నాటకాన్ని రూపొందించాలనే ఉద్దేశ్యంతో యీ నాటకాన్ని రచించారు. బంధుత్వమైనా చూచుకోకుండా కట్నాలకోసం వత్తిడి చేసే ధనికుల మనస్తత్వాలు, పెద్ద చదువు చదివినా అలక పాన్పుమీద, ఎదుటివారి స్తోమతను గుర్తించకూడా, కార్లు కావాలనే ఆధునిక యువకులు, మోసం చేస్తూ, దొంగ వోట్ల వ్యాపారం చేస్తూ డబ్బును సంపాదించి, దాన్ని ఎరగా చూపి అమాయకుల్ని మోసం చేయాలని ప్రయత్నించే ప్రబుద్ధుల మనస్తత్వాల్ని రచయిత చక్కగా నాటకంలో చిత్రించారు. తెలుగు ప్రాంతీయ భాషల్ని అంతగా ప్రవేశ పెట్టలేకపోయినా (రచయిత 'నాలుగు మాటలు' లో చెప్పినట్లు), ఉన్నంతవరకూ సహజంగా ఉంది. నెల్లూరు యాసతో మాట్లాడే పియ్యన్న, తమిళం, తెలుగు కలిపి మాట్లాడే మునుసామి, దీర్ఘాలతో మాట్లాడే ధ్వజపతి పాత్రలు కడుపుబ్బ నవ్విస్తాయి. కానీ అక్కడక్కడ యింకు మాన్, లక్ష్మిల సంభాషణలు అసహజంగానూ, వాస్తవానికి చాలాదూరంగానూ ఉన్నట్లనిపిస్తుంది. అర్థాన్ని పూర్తిగా మార్చివేసే అచ్చుతప్పులు డైలాగ్, మైనంల సంభాషణల్లో దొర్లటం వల్ల చదివే వారు తికమక పడాల్సి వస్తుంది. మొత్తంమీద నాటకం చదువుతున్నంతసేపూ వదలకుండా చదవాలనిపించే విధంగా ఉంది. మూడేమూడు రంగాలు, ఒకేసెట్, తక్కువ పాత్రలు ఉండటం వల్ల నాటకం ప్రదర్శించటానికి అనుకూలంగానే ఉంటుంది. అయితే రచయిత అన్నట్లు ప్రదర్శకులు నిరంతరమైన దీక్షతో నాటకం ప్రదర్శించ బూనుకుంటేనే విజయం సాధిస్తారు.

## శ్రీరామకృష్ణమహోదయము

రచన: శ్రీ నారు నాగనార్యులు, 112 పేజీలు. మూల్యం: రూపాయిన్నర. ప్రతులకు: శ్రీ ధ్యాన ప్రకాశానందస్వామి, శ్రీసద్గురు సేవాశ్రమం, పంగిడిపూడి పోస్టు, తూర్పు గోదావరి జిల్లా.

శ్రీ రామకృష్ణ మహోదయం అన్న ఈ పద్య కావ్యమునకు మూలము శ్రీ చిదంబర స్వాముల వారు రచించిన శ్రీ రామకృష్ణ జీవితం. వచన కావ్యంగా నున్న శ్రీ రామకృష్ణ జీవితమును శ్రీ నిర్గుణ యానంద బ్రహ్మచారి శ్రీ నారు నాగనార్యుల చేత పద్యకావ్యముగా రూపొందింప జేశారు. ఇందులో శ్రీ రామకృష్ణ భగవానుని జీవితమునకు సంబంధించిన పద్య సముదాయముతో చిత్రింప బడినది. కథా ప్రారంభము, శ్రీ దేవీసాన్నిధ్యము, తన్మయావస్థ, సాధనాభూమిక, ప్రచారపూర్ణదశ అను ఆరుభాగములుగా ఈ కావ్యము విభజింపబడి చదువరులకు ఆసక్తి కలిగించు శైలిలో పద్య రచన గావింపబడినది. ఆధ్యాత్మిక గ్రంథములందభిలాష గలవారికి 'రామకృష్ణమహోదయము' మిక్కిలి ఉపయోగపడగలదనుటలో సందేహము లేదు.

—ఎస్. ఆర్.

# సింగర్ వారిది

## భారత దేశపు మొట్టమొదటి చేతి అల్లిక మిషను











## సిమెక్ ఆర్ట్ నిట్టర్

అల్లికములో ఒక మహత్తరమైన క్రొత్త ప్రపంచాన్ని సింగర్ మీకోసం సృష్టిస్తున్నది.. సిమెక్ ఆర్ట్‌నిట్టర్‌ను ప్రవేశ పెడుతున్నది. ఇది భారతదేశపుమొట్టమొదటి చేతిఅల్లికపుమిషను. ఉన్నినేకాకుండా నూలు సింథటిక్ దారాలనుకూడా ఇది అల్లుతుంది. అతి వేగంగా పనిచేస్తుంది: అనేకరకాల అందమైన దుస్తుల్ని — మామూలు వాడుకలోవున్న మేజోళ్లు, వెయిస్ట్‌కోట్లు దగ్గరనుండి శాలువలు, పక్కా-మైన పరిచేదుప్పట్ల దాకా—ఉత్పత్తి చెయ్యడంలో అదిమీకు సహాయ పడుతుంది.

ఆర్ట్ నిట్టర్‌తో, అల్లికము అద్భుతమైన ఒకక్రొత్త కాలయాపనం — అర్థికస్తోమతనిచ్చేది అయినకాలయాపన అవుతుంది. కొద్దిపెట్టుబడితో త్వరలోలాభాలు సాధించాలను కొనేవారికి కూడాయిది సహాయ పడుతుంది.

మీకుసమీపంలోని సింగర్ దుకాణములో గానీ లేక అధికారము పొందిన సింగర్ డీలరు వద్దగాని లభించును.

సింగర్ మ్యానుఫాక్చరింగ్ కంపెనీ, బొంబాయి • కలకత్తా • ఢిల్లీ







సింగర్ కంపెనీవారిచే ట్రేడ్‌మార్కు.

# పాశ్చాత్యానుకరణ ఎంతవరకూ..?

విశాఖ

మొన్నీమధ్య అమెరికా నుంచి మాస్నేహితురాలు ఉత్తరంలో అనేక విషయాలు రాస్తూ "ఇక్కడ మా యూనివర్సిటీలో ఉన్న కొందరు బెంగాలీలని చూస్తే నాకు చాలా విచిత్రంగా వుంది. అనేక వాటిల్లో అతి నాగరికంగా, అతి 'మోడర్న్‌గా'వుంటారు. వేషధారణ చూస్తే అతి వెస్టనైజ్డ్‌గా వుంటారు. కాని వాళ్ల పెద్దవాళ్లెవరైనా కనపడగానే యూనివర్శిటీలో అంతమంది ఎదుట సిగ్గూ సంకోచం లేకుండా వంగి ప్రమాణం చేసి శరత్ హీరోయిన్లలాగా పాదధూళి తీసుకుంటుంటారు. బెంగాలీలే కాదు, ఇంకా కొందరు హిందూస్థానీలు కూడా అంతే. వేషంలో పాశ్చాత్యులని అనుకరించినా వాళ్ల పండగలూ అవీ మర్చిపోకుండా చేసుకుంటారు. ఈ ప్రాక్పశ్చిమల కలయిక నాకు చాలా విడ్డూరంగా ఉంది, మా డిపార్టుమెంటుకి సరిగా ఎదురుగుండా ఉన్నదాంట్లో ఒక అరవాయన వున్నారు. ఆయనభార్య ప్రొద్దుటే లేచి గుమ్మం ముందర ముగ్గువెయ్యటం మర్చిపోదు"అంటూ ఈ విషయం గూర్చిచాలా రాసింది.

దీన్నిగురించి ఆట్టే ఆలోచించలేదుగానీ ఈ మధ్య మాకు తెల్సిన ఒక బెంగాలీల యింటికి వెళ్లాం. ఎంతసేపూ ఆవిడకి ఆవిడ పూజలు, కాళీఘాట్‌కివెళ్లడం దక్షిణేశ్వరం వెళ్లటం తప్ప ఇంకో గొడవ పట్టించుకోదు. ఆవిడ మేనగోడలు పైచదువులకని విదేశాలకి వెళ్లింది. అక్కడ ఒక మళయాళీని పెళ్లాడిందట. ఆవిడ వాళ్లిద్దరివీ ఫోటోలు చూపెట్టుతున్నారు. అందులో ఒక ఫోటోలో దుర్గాప్రతిమ ఉండేసరికి మేం ఆశ్చర్యపోయాం. ఆవిడే చెప్పారు. విమానంలో ప్రతిమల్ని తెప్పించుకుందిట ఆ అమ్మాయి. అతి సుందరంగా అలంకరించి పూలమాలలు వేసి అల్పనాడిజైన్లతో రంగవల్లులు తీర్చి మనోహరంగా ఉందా పూజాస్థలం ఫోటోలో. మా ఆశ్చర్యానికి అంతులేదు. చేతుల్లేని రవికె వేసుకోవడం అతిగా పాశ్చాత్యనాగరిక ప్రభావానికి లోనైనవారే చేస్తారు అనుకునే వాళ్లకిది మరీ ఆశ్చర్యంగా ఉండదూ! వేషంలో పాశ్చాత్యులని అనుకరిస్తూ వివాహం బెంగాలీకాని వారితో అయి, మానసికంగా దుర్గాపూజ వదలనేరని ఆ యువతి మనకి అర్థం కాకపోవటంలో ఆశ్చర్యం లేదు.

దీన్ని మా స్నేహితులతో చెప్తే వాళ్లిచ్చిన జవాబిది. "ఎంతవరకూ లేటెస్ట్ ఫ్యాషన్లని అనుకరించి మేం బాగా అలంకరించుకోగలం అని తెలియచెప్పాలనే మేం అనుకరిస్తాం. కానీ భారతదేశీయులం అన్న విషయం ఎక్కడికెళ్లినా మర్చిపోనేరం. అతి నాగరీకంగా అలంకరించుకుని 'రాష్ బిహారీ అవెన్యూ'లో నల్గురు స్నేహితులతో కబుర్లు చెప్పుకుంటూ కేరింతాలు కొట్టుతూ వెళ్తూన్నా చాలారోజుల తర్వాతచూస్తే పెద్దవారికి వంగి పాదధూళి తీసుకుంటాం. ఇందులో సిగ్గుపడాల్సిన విషయంలేదు. అలాగే దుర్గాపూజలు— చిన్నప్పటినుంచీ దుర్గాపూజలు మాలో జీర్ణించుకు పోయాయి. అందువల్లే దాన్ని మానడం కష్టం"అన్నారు.

ఇంకా దక్షిణదేశాన మనుష్యులు ఈ పాశ్చాత్యానుకరణని సరిగా ఆమోదించటం లేదు. పంజాబీ స్త్రీలు అతి ఆధునికంగా అలంకరించుకుంటారు. వాళ్లను చూసిన మనవాళ్లలో కొందరు "బొత్తిగా మొగరాయుళ్లలా" అనడం నేనెరుగుదును. బయటి వేషానికీ మానసిక భావాలకీ ముడిపెట్టడం, పాశ్చాత్య ప్రభావాల వల్ల మనవాళ్లు చెడిపోయారనుకోవడం అవివేకం అన్పిస్తుంది. చెడిపోయేవారికి పాశ్చాత్యుల ప్రభావాలే అక్కరలేదు.

ఆ మధ్య మద్రాసుకి వెళ్లినపుడు మావారి స్నేహితుడ్ని చూడ్డానికని వెళ్లాం. ఆరోజున వాళ్లింట్లోవాళ్లు గుడికెళ్తున్నారు. మావారి స్నేహితుడ్ని రమ్మంటే రానన్నారని అతనితల్లి "అమెరికా వెళ్లివచ్చాక బొత్తిగా దైవభక్తిపోయింది. ఎంతసేపూవాళ్లని అనుకరిస్తూ ఉండటమే పని"అని తిట్టుకున్నారు. నిజానికి అతనికి భక్తి లేకపోలేదు— కపాలేశ్వరుని ఉత్సవ జనసముద్రంలో కొట్టుమిట్టాడనేరక రానన్నారు. అదిమాకు తెల్సు. ఆయన గుడికి, అక్కడ ఆట్టే జనం లేకుండా ప్రశాంతంగా ఉండేసమయం చూసుకువెళ్తారు. అలాగే 'ఫారిన్'నుంచి వచ్చిన ఒక తెలుగావిడ అన్నారు. "ఈ దేశంలో ఉన్నంతవరకూ నేనంతగా పూజలు గూర్చి అదీ పట్టించుకునే దాన్నిగాను. కానీ అక్కడకి వెళ్లాక అక్కడివాళ్లు మన దేముళ్ల గూర్చి ప్రశ్నించేసరికి అన్ని పుస్తకాలనీ తెప్పించుకుని చదివి మనమతం గూర్చి క్షుణ్ణంగా నేర్చుకున్నాను. ఇప్పుడు నేను పూజలు మానటంలేదు. ఏనాడో ఆపేసిన శ్రావణమాసం నోముల్ని, అట్లతద్దెని మళ్లీ నోచుకుంటున్నాను" అన్నారు.

ఇవన్నీ చూస్తుంటే నాకు అన్పించింది. బయటి వేషభాషలకీ ఆచారాలకీ, అనుసర



# వనితాలోకం

ఐలకీ మనోభావాలకీ ముడిపెట్టకూడదని. మనలో చాలామందికి నాగరికంగా అలంకరించుకోవడానికి ధైర్యం లేకపోయి, మిగతా వారిని వేళాకోళం చేస్తూ కూడా ఇంట్లో అమ్మమ్మల్నీ, బామ్మల్నీ పాతకాలం వారని, మూఢనమ్మకాలనీ విసుక్కుంటూ ఉన్నట్లే, అతి మోడర్న్‌గాఉండి వేరే జాతివారిని పెళ్లాడినా వాళ్లపూజల్నీ వాళ్ళు పాటుకోని వారూ వున్నారు. మడి, ఆచారం అని గొడవపెట్టకుండా శుభ్రంగా, శుచిగా ఉండి దేవుడిని పూలతో అలంకరించి ధ్యానించుకోగలిగితే దానిని ఒక బిహారీ ఆనిత





కారించిందిః ఇందులో సత్యంలేకపోలేదు.

అసలు పాశ్చాత్యులని అనుకరించినందున మనవాళ్లు చెడిపోతున్నారు, పూర్తిగా మలినం అయిపోతున్నారనే వాదన సత్యంకాదు. పాశ్చాత్యులని అనుకరించి మనం ఎన్నో నేర్చుకున్నాము. శుభ్రంగా ఉండటం, ఇంటిలో విద్యుచ్ఛక్తి సహాయంతో అనేక పనులు చేసుకోవడం, విలాస వినోద కార్యక్రమాలలో పాల్గొనటం, భర్తతో సమానంగా అన్నింటిల్లో భాగం పంచుకోవడం, పిల్లల్ని పెంచడంలో శ్రద్ధ, పిల్లలచదువుల విషయంలో శ్రద్ధ, స్త్రీలకి విద్య, ఉద్యోగాలు అన్నింటిలోను ఒక పరిణితికి రాగలామంటే అది పాశ్చాత్యులనుంచి నేర్చుకున్నదేను. మనలో చాలామంది తమకి అనుగుణమైనది మాత్రం అనుకరించి విశ్వాసవితాన్ని సాఫీగా నడుపుతున్నారు. కొందరు గ్రుడ్డిగా అనుకరించి చెడిపోయినందువలన పాశ్చాత్యానుకరణవలన అన్నీ నష్టాలే అనటం సబబు కాదు. పాశ్చాత్యానుకరణవలన లాభనష్టాలని తెలిసి చేసి చూసుకోవడం అన్నది సాధ్యం కాదు.

మనవారు రెస్టారెంట్లలో భోంచెయ్యటం తినుకోవడం, ట్విస్టు, చాచాచా చెయ్యడం ఇవన్నీ పాశ్చాత్యుల మూలంగానే వచ్చిందంటారు. కాని ఇవన్నింటినీ గ్రుడ్డిగా అనుకరించమని వారేం మనకు చెప్పలేదే. అదీగాక మద్యపానం, ధూమపానం పూర్వకాలంనుంచే ఉన్నాయి. పూర్వం మొగలాయిల పరిపాలనలో మద్యపానం, హుక్కా అన్నీ వుండేవికదా! రాగా పోగా ప్రస్తుతం అవి రూపంమారి మరో రూపంలో సిగరెట్లుగానూ, పైపులుగానూ సాక్షాత్కరించాయి.

మానసిక దౌర్బల్యం ఉన్నవారు నిగ్రహించుకోలేక చెడ్డ అలవాట్లకి లోనవుతారు. దానికి పాశ్చాత్యులని అనుకరించి చెడిపోతున్నారని, దాన్ని పాశ్చాత్యులకి అంటగట్టటం తప్పు. వారి దేశంలో చెలామణిలో వున్నవి, వాళ్లదేశ అలవాట్లనిబట్టీ, శీతోష్ణస్థితినిబట్టీ, కొన్నింటిని వాళ్ళు చేస్తున్నారు. వాటిని మనదేశంలో ఎంతవరకూ ఉపయోగించాలీ, వేటిని వదిలెయ్యాలీ, అన్న విచక్షణాజ్ఞానం మనకుండాలి. ఇదే మనలో కొందరిలో లోపించిన విషయం. అనర్థాలన్నీ గ్రుడ్డిగా అనుకరించడం వల్లే కలుగుతున్నాయి. మనుష్యులందరికీ ఆలోచించే శక్తిని దేవుడిచ్చాడు! ప్రతివిషయాన్నీ ఆలోచించి పరులలోని మంచిని మాత్రం గ్రహించి అనుకరించగలిగితే మంచిది. మన తప్పులకి మన మానసిక దౌర్బల్యాలకి ఇత

లా అని క్లైవ్?...మీలాంటివారు ఇంత అపాయకరంగా అవన్నీ నాకు చెప్పడమేగాక వాటిని నేను విపరీతంగా అర్థం చేసుకుంటానని ఎదురుచూడడం వింతగా వుంది......"

పామును చూసి త్రాడనుకున్నారయ్యా. అదే పొరబాటు. పాముని చావగొట్టండి— అని చెబుతుంటే, ఇది త్రాడే, కాని ఇది పామువలె వుండడం సహజం అంటాడేమిటి? నవ్వాలా ఏడవ్వాలా అని సంశయం వచ్చింది కృష్ణయ్యకు.

ధర్మారావు ఇంకా చెబుతున్నాడు. "......ఈ వూర్లో ఆ రాధా కృష్ణ మందిరం కట్టించింది మీరు. గవర్నమెంటు ఆస్పత్రికి ఫర్నిచర్ కొనిచ్చింది మీరు. హైస్కూల్లో ఏడాదికి పది ఉచిత వేతనాలు ఏర్పరచింది మీరు.....వెలుగూ చీకటీ అందరిలోనూ వుంటాయి. ఆ చీకటిని చూడగల్గడమే మీ ఔదార్యాన్ని చాటుతుంది. కాని మీలాంటి పెద్దలు, ప్రజా నాయకులు చెయ్యవలసిన పనికాదది"—

"—ఇహ ఆపండి!.... ధర్మారావుగారూ, మరొక చిన్న వార్త చెబుతా వినండి.....ఆ రాధాకృష్ణమందిరంలోనే ఒక మూల, నేల మట్టానికి దిగువ ఒక అచ్చువేసే శాల వున్నది. అక్కడ ఏమి అచ్చు వేస్తున్నారో తెలుసా? 'కృష్ణ కర్ణామృతమూ', 'భగవద్గీతా' అనుకుంటున్నారేమో కాదు....అక్కడ ముద్రిస్తున్నవి దొంగనోట్లు!"

ధర్మారావ్ కనుబొమలు ఎగిరాయి.

"అవును!.....ఐదులు, పదులు, వందలు అన్ని నోట్లూ వేస్తున్నారు. వేయిస్తున్నది ఎవరో తెలుసా?—నేనే!.....ఇప్పుడయినా మీ కర్తవ్యం నెరవేరుస్తారా?"

ఒక నిముషంసేపు ఏమీ మాట్లాడలేక పోయాడు ధర్మారావు.

"కృష్ణయ్యగారూ! ఇదే నిజమయితే, నేనే గనుక ఈ దొంగనోట్ల ముద్రణాలయాన్ని పట్టుకోగల్గితే నా ప్రమోషన్‌కూ, నా భవిష్యత్తుకూ ఎంత బ్రహ్మాండమయిన అవకాశం అనుకున్నారూ! ఇంతటి మేలు చేసిన మీకు ఎటూ కృతజ్ఞత చెప్పడం— ఎట్లా?"

ఈసారి మౌనం కృష్ణయ్యను వరించింది.

"......అయినా మీలాంటివారికి దానితో సంబంధం వుందంటే ఎవరయినా నమ్ముతారటండీ—నామీద పెద్ద జోకు విసురుతున్నారు మీరు! అయినా...."

# బ్రతుకన్నది ఒకవరం

16 వ పేజీ తరువాయి

తటాలున లేచాడు కృష్ణయ్య. కుర్చీ వెనక్కు పడింది. ఆయన కళ్లు మెరుస్తున్నాయి. పళ్లు బిగించి గొణిగాడు..... "అంధులు. ..మూర్ఖులు...." అని గిరుక్కున తలుపు తీసుకుని ధణధణమని అదిరే అడుగులతో నడవసాగాడు. ఆయన కాళ్ల క్రింద తివాసీయే గనుక లేకపోతే ఆ అడుగుల దెబ్బకు క్రిందవారి నెత్తిమీద గచ్చూడి పడేది. మండిపడుతున్న వేగంతో చరచర మెట్లు దిగసాగాడు.

ఆదేవేగంతో మెట్లు వంపు తిరగడంతో పట్టు తప్పింది.

అంతే, దబ దబమని దొర్లుకుంటూ ఇరవైమూడు మెట్లూ క్రిందకువచ్చిపడ్డాడు కృష్ణయ్య.

* * *

స్పెషల్‌వార్డులో రాత్రి డ్యూటీ నర్సు కమల చేతి వాచీ చూసుకుంది. తొమ్మిదిన్నరయింది. ఆరోనెంబరు గదిలోకి అడుగు పెట్టింది.

తల వెనుక మూడంగుళాల పొడవున కుట్లతో, ఎడమ మోకాలినుండి మడమదాక ప్లాస్టర్ తొడుగుతో మంచంమీద పడివున్న కృష్ణయ్యకు స్పృహపోయి ముప్ఫైరెండు గంటలు దాటింది.

అప్పుడే లోపలికి వచ్చిన కమల, కృష్ణయ్య పెదవులనుండి బుసలు బుసలుగా ఏదో శబ్దం రావడం గమనించింది. కాస్సేపు చూసి బయటికి వెళ్లింది.

పది నిముషాల తర్వాత డాక్టర్ డేవిడ్‌తో పాటు వచ్చింది.

ఉండుండి కృష్ణయ్య పెదవులు కదులుతూనే వున్నాయి. కమల ఆ విషయం డాక్టర్ డేవిడ్‌కు చెప్పింది.

డేవిడ్ కృష్ణయ్య మంచం ప్రక్కనే స్టూలు వేసుకుని కూర్చుని పరీక్షించాడు. కృష్ణయ్యను అతి శ్రద్ధగా గమనించాడు. ఇరవై నిముషాలకు కృష్ణయ్య ముప్ఫైమూడు గంటల తర్వాత మొదటిసారిగా కళ్లు తెరిచాడు. పెదవులు తెరిచి, అస్పష్టంగా మూలిగాడు. కళ్లు మూసుకున్నాడు.

ఆయన పిడికిళ్లు గట్టిగా మూసుకున్నాయి. ముఖమంతా ముడతలుపడింది. ఏదో గట్టిగా అరిచాడు. పళ్లు పటపటా కొరికాడు. కాళ్లు తన్నుకుంటున్నాడు.

కమల పరుగెత్తుకొచ్చి ఆయనను పట్టుకుంది. డేవిడ్ ఇంజక్షన్ ఇచ్చాడు.

క్రమంగా కృష్ణయ్యలోని భూకంపం సర్దుకోసాగింది. పిడికిళ్లు తెరుచుకున్నాయి. ఆయన కండరాలన్నీ విశ్రమించసాగాయి. ఆయనను మత్తు ఆవరించింది.

డేవిడ్‌లేచి కమలతో ఏదో చెప్పి తన గదిలోకి వెళ్లిపోయాడు.

ఆ రాత్రి రెండు మూడుసార్లు కమల, ఆ గదిలోకి వచ్చి చూసి వెళ్లింది.

తెల్లవారింది.

కృష్ణయ్య కళ్లు తెరిచాడు. చుట్టూతా పరికించాడు. తెల్లటి గోడలు, తెల్లటి పడక గుడ్డలు తెల్లటి షెల్ఫ్— కనుపించాయి.

నెమ్మదిగా తల కదిలించకుండానే చూపుల్ని ప్రక్క కిటికీవైపు పారించాడు. అవతలెక్కడో పెద్ద చెట్టేదో వుంది కాబోలు— దాని తాలూకు చిన్న కొమ్మ ఒకటి ఈ కిటికీ ముందర కదులుతున్నది. అప్పుడే ఉదయిస్తున్న సూర్యుడి కిరణాల స్పర్శకు కాబోలు పులకించి నృత్యం చేస్తున్నాయి ఆ లేత పచ్చ ఆకులు.

తలుపు తెరిచిన చప్పుడయింది. ఉలిక్కిపడ్డాడు కృష్ణయ్య. కండ్లు ఇటు మళ్లించాడు. కమల లోపలికి వచ్చింది—ప్రశాంత వదనంతో.

ఇంతవరకూ గమనించలేదు కృష్ణయ్య. తన ఎదుట ఆ షెల్ఫుమీద ఒక ఫ్లవర్‌వేజు వున్నది. కమల అందులో పువ్వులగుత్తి నుంచింది. ఇటు తిరిగింది.

"ఏమండీ...బాగా నిద్రపోయారా రాత్రి" చిరునవ్వుతో పలకరించింది కమల.

కృష్ణయ్య మాట్లాడలేదు.

"కంగారుపెట్టుకున్నారా, అదేం! మీకేమంత పెద్ద గాయం తగిలిందని? ఇంకొక నెలలో మనమున్న అందరితో కలిసి హాయిగా తిరుగుతుంటారులెండి!"— అంది కమల ఆయన చేతిని తడుతూ.

చల్లని స్పర్శ—లేత ఆకులు—బంగారు కిరణం—రంగు రంగుల పువ్వులు—అన్నీ..... తాను అందరిలో ఒకడుగా ఎన్నటికీ కాలేడు. ఆ హక్కును ఏనాడో కోల్పోయాడు— నిట్టూర్చాడు కృష్ణయ్య ●

# సంగీతరాజు

అంబాసిడర్ కార్లో ముందుసీట్లోనుంచి దిగి తలుపువేసి, అది పడిందో లేదో ఒక మారులాగిచూసి కొని, చేతితో పుస్తకం తెరిచి, తనలోనే తను చదువుకొంటూ పొయ్యే అతి సామాన్యవేషధారి సాలూరి రాజేశ్వరరావుగారు కావటం ఆశ్చర్యకరం

రాజేశ్వరరావుగారు, నిజంగా రాజేశ్వరరావులా వుండరు రెండున్నర దశాబ్దాలనుంచి తెలుగు సినిమా ప్రపంచంలో సంగీతపు పీఠానికే అధినేత "యీాయనేనా?' అనిపించేలా వుంటారాయన సెలయేటి నాదాల్లోని మాధుర్యాన్ని, సముద్రపు హోరులోని గాంభీర్యతను—ఒకటేమిటి సృష్టి వినిపించే ప్రతి సృష్టికి, తనవైన సాధనాలతో ప్రతి సృష్టి చేసి, సహజమైన సంగీతపు ప్రపంచం మరొకదాన్ని సృష్టించారాయన

ఆనాడు—1940 లో రామబ్రహ్మంగారు తీసిన 'ఇల్లాలు' లో రాజేశ్వరరావుగారే కనిపిస్తారు రాజేశ్వరరావుగారి చిత్రాలన్నిటిలోను వినిపించే ప్రతి నాదం వెనుక, ప్రతి వీణమీటు వెనుక, ప్రతి తాళం వెనుక ఆయన రూపం కనిపిస్తుంది

## ఇల్లాలు

1939 లో తొలుత 'జయప్రద' చిత్రానికి ఆయన సంగీత దర్శకత్వం వేశారు ఆ చిత్రంతో పాటు, ఆనాడు రాజేశ్వరరావుగారి పేరు కూడా మరుగున పడిపోవటం తప్పనిసరి అయిపోయింది మరుసటి సంవత్సరమే 'ఇల్లాలు' రావటంవలన శ్రీ రాజేశ్వరరావు కీర్తి ప్రతిష్ఠలు తొలిసారిగా వెలుగును చూడటానికి ఒక సందర్భం వచ్చింది ఆయన స్వతహాగా ప్రతిభ కలవాడు కాబట్టి వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసికొన్నారు రామబ్రహ్మంగారి 'ఇల్లాలు' విడుదలయిననాడు శ్రీ రాజేశ్వరరావు వయస్సు 18 సంవత్సరాలు

రాజేశ్వరరావుగారికి శ్రేయోదాయకమైన సంగీతం పట్ల, సంగీతరచనపట్ల ఎనలేని మమకారం ఉన్నప్పటికీ





అవిరామకృషివాలు తెచ్చిన పురస్కారాలు

మరోవైపు 'నటుడు' కావాలనే అభిరుచి కూడా వుండే దట అందుకు తగ్గట్టు ఒకటి రెండు 'వేషాలు' వేశారుట

## అదృష్టదేవత

మనిషికీ, అదృష్టానికి వుండే సంబంధ బాంధవ్యాలు చాలా చిత్రంగా వుంటాయి 'అదృష్టదేవత' ఒక్కమారు ఒకరిని వరించిందంటే, ఒకరాగాన విడువదట శ్రీ రాజేశ్వరరావుగారి విషయంలో అది నిజంఅయింది 'ఇల్లాలు' విడుదల కాగానే, ఆయనకు ఆహ్వానంమీద ఆహ్వానాలు వచ్చాయి అందులో జెమినీవారి 'చంద్రలేఖ' చిత్రానికి సంగీత దర్శకత్వం వేసే అవకాశం రావటమే, సాలూరివారి మహోత్కృష్టమైన సంగీత జీవనంలో సువర్ణఘట్టం 'చంద్రలేఖ' ఆసేతు హిమాచలం జనాన్ని

ఆయారు చేసిన "జీవన్ముక్తి, బాలనాగమ్మ, మంగమ్మ శపథం" మొదలయిన చిత్రాలు — తదనంతరం వల్లీశ్వరి — లోగడ ఆయనకు లభించిన కీర్తి ప్రతిష్ఠలను మరోమెట్టు పైకి తీసికొని వెళ్ళాయి.

## చైతన్యప్రవంతులు

ప్రేమ, అభిమానాలకొద్దీ కొందరు కొన్ని విద్యలకు బానిసలయితే, మరికొందరు ఆవే విద్యలతోటే రాజ్యాన్ని నిర్మించుకొని, రాజ్యపాలనచేస్తారు ఆమాట కొస్తే 'నాతీ నా రాణి' అని కూడా చెప్పుకొన్నవారు తరిగ్రతకు అందరివారు కారు అలాగే రాజేశ్వరరావుగారు కూడా ఆయన చెప్పినట్లు వీణామోహాని. వారి అనుజ్ఞ లేనిది 'సితార్' నోరు విప్పదు సన్నాయి పలకదు శ్రీ రాజేశ్వరరావుగారు వాటన్నిటికీ సార్వభౌములు ఆ రాజ్యానికి ఆయన రాజు. తెలుగున

# రాజేశ్వరరావు



సంగీత రచనా వేళ

కలకత్తాలో కె ఎల్ సైగాల్ ప్రభృతులవద్ద చేసిన కృషులు ఆయన కీనాడు యిలాంటి ఉన్నత స్థానాన్ని తెచ్చిపెట్ట గలిగాయి తెలుగులో 'సంగీత ప్రపంచంలో' శ్రీ రాజేశ్వరరావుగారి కృషితోనే చైతన్యం ప్రవహించింది కొత్త బాణీలు, కొత్త స్వరాలు పీఠవేశ్యాం

రాజేశ్వరరావుగారు మధుర గాయకులని చాలా మందికి తెలుసు చాలామందికి తెలియదు ప్రైవేట్ రికార్డుల సంస్థలకు ఆయన ఎన్నో పాటలను మధురంగా పాడారు ఒకప్పుడు (1945 లో అనుకొంటా) ఆయన పాడిన 'విభావరి' నాటికీ నేటికీ క్రొత్తదిగా వుంటుంది 'యాత్రికుడా', 'చల్లగాలిలో', 'ఓహో మబ్బుదా ఒకసారి', 'షికారుపోయి చూదామా,' 'ఓహో విరుల కోరికా' అనే పాటలు ఆయన పాడారు, పాటలో ఎంతో వైవిధ్యం వుంది

ప్రస్తుతం ఆయన సంగీత దర్శకత్వం చేస్తున్న చిత్రాలు అర డజనుకుపైగా ఉన్నాయి బి ఎన్ రెడ్డిగారు తీస్తున్న 'రంగులరాట్నం', రామినీడు గారి 'భక్తపోతన', 'పల్నాటియుద్ధం'; అన్నపూర్ణా వారి 'ఆత్మ గౌరవం', ఎ వి యం వారి 'భక్త ప్రహ్లాద', ప్రత్యగాత్మవారి 'చిలకా—గోరింక' మొదలయినవి యిందులో ముఖ్యమైనవి

తెలుగు దేశంలో సంగీతపు ప్రపంచంలో శ్రీ రాజేశ్వరరావుకు ప్రత్యేకమైన స్థానం రావటానికి ఒకే కారణం: ఆయన ప్రతిభ సంగీతంలో ఆయనకుండే ప్రావీణ్యం ఆయన్ను 'రాజేశ్వర(రావు)'ని చేయ గలిగింది.

## పగటి వెన్నెలలు

అనుమ్మ నాగాయులరెడ్డిగారు, రాజేశ్వరరావుగారు కలిసి బి ఎన్ రెడ్డిగారి 'మైత్రి' తో పగటిపూట వెన్నెలను కురిపించారు జగమే ఊయలన్నారు. కొందరు 'ఇదేమిటి? ఇది సంభవమా?' అన్నారు. ''కదలే వూహలకు కన్నులుంటే'' అసంభవం ఏముంటుంది?

రాజేశ్వరరావుగారు యీనాడు చాలామందికి గురుపాదులు ఆయనకు ఏకలవ్యులూ వున్నారు. శిష్యులూ వున్నారు ఆయనకు ఆ అధికారం వుంది. సంగీతాన్ని ఆరాధించే యువతరానికి 'ఆయన్ని' గురువుగా ఆరాధించే హక్కువుంది

శ్రీ రాజేశ్వరరావు, తన యింట అందరినీ 'సంగీత వాదులు' చేస్తున్నారు ఒకబ్బాయి సితార్, మరొకరు వీణ, మరొకరు పియానో వాయిస్తారు పెద్దబ్బాయి రామలింగేశ్వరరావుగారు 'ఎర్రగులాబీ'కి సంగీత దర్శకులు

## ఇదీ నిజమా!

రాజేశ్వరరావుగారిని గురించి మరో 'వ్యాఖ్య' కూడా వింటాం ఆయనకు నిలకడ తక్కువంటారు. ''మూడుకాళ్ళుండే కుందేళ్ళు కూడా ఆయనకు తెలియనివికావు!'' ఈ ఆరోపణకు ఆధారం తక్కువ అనుచేసే పనిలో మరొకరి జోక్యం వుంటే సృష్టికర్తకైనా 'నిలకడ' తగ్గుతుందేమో! నిజమైన కళాస్రష్టకు, యీ రకం వైఖరికీ సమన్వయం కదరదే?

శ్రీ రాజేశ్వరరావు తెలుగుదేశంలోను, తెలుగు సినిమా దేశంలోనూ అసామాన్యుడు అందుకే సాలూరి రాజేశ్వరరావుగారు మరిరెండు దశాబ్దాలయినా సంగీతపు రాజేశ్వరరావుగారుగా రాణిస్తారు, రాజ్యం ఏలుతారు

— వాశిరాజు ప్రకాశం ●



రాజేశ్వరరావుగారు.

# అనాధ శరణాలయంనుంచి వెండితెరకు...మార్లిన్ మన్రో

మార్లిన్ మన్రో.

[illegible] స్మృతిపథంలో దేదీప్య [illegible]. నేను ఫోటోలు [illegible] కొందరో మరుగున [illegible] కొందరు కాలగర్భంలో కలిసి పోయారు కూడా. కాని, వీరెవరూ నా స్మృతి పథంనుండి తొలగిపోరు. ఆ జ్ఞాపకాలకే నేను [illegible] నీరు పోస్తున్నాను.

ఆరోజు నటి మార్లిన్ మన్రో ఇంటికి [illegible] - నా కింకా బాగా గుర్తు.

[illegible] ప్రాసాదంలోకి వెళ్లటం [illegible], ఒక రకంగా మార్లిన్ మన్రో ఇంటికి వెళ్లటమే కష్టమనిపించింది నాకు. ఆ నటి ఇంటిలోకి వెళ్లేందుకు అంతకు ముందే నాకు లభించిన 'పాస్'ను ఆరోజున [illegible] కనీసం ఆరుగురు అధికా [illegible] పరీక్షలు చేశారు.

మార్లిన్ మన్రో నటించిన తొలి చిత్రా [illegible] ఛాయాగ్రాహకుణ్ణి నేనే. అందువల్ల [illegible] లాంటి వాడికి ఎలాంటి అవకాశాలు [illegible] నూహించుకోవచ్చును.

ఆ [illegible] అపార్టుమెంట్‌లో వుండేది. [illegible] మార్లిన్, ఆమె భర్త అర్థర్ మిల్లర్ వుండేవారు. శ్రీ మిల్లర్ నాట [illegible] రాస్తుంటారు. ఆ రోజుల్లో లారెన్స్ [illegible], 'ది స్లీపింగ్ ప్రిన్స్'' అనే చిత్రా [illegible] చేస్తున్న సమయం అది.... ఆ ఇంటిలో వుండే 'రక్షక భటులు' జరిపిన అర్భాటం చూశాక, నా సహనం మరీ దెబ్బ తింది.

నే కోల్పోయిన సహనాన్ని తిరిగి పుంజుకోవటానికి అప్పుడే విరామం దొరికింది కూడా. అప్పటికి పది గంటలు దాటి పోతున్నప్పటికీ మార్లిన్ నిద్రపోతూనే వున్నది.

మార్లిన్ లోపల నిద్రపోతూవుంటే, హాల్లో నేను, ఆర్థర్ మిల్లర్ మాట్లాడుతూ వుండిపోయాం. ఆమె తన పడక గదిలోనుంచి బయటికి వచ్చేసరికి 10—30 గంటలన్నా అయివుంటుంది.

ఆ సమయంలో ఆమె—రాత్రుల్లో ధరించే గౌను తొడుక్కొనివుంది. కాళ్లకు చెప్పులుకాని, ఏమీ లేవు. కళ్లు నిద్ర వలన కాటోలు మత్తెక్కి ఉన్నాయి.

ఆమెను చూడగానే నా కోపం అంతా ఒక్కమారు చల్లారిపోయింది. చిడిమితే పాలు కారిపోయేలావుంది ఆమె ముఖం. 12 సంవత్సరాల అమ్మాయికి వుండే నాజూకుతనం, ఆనాడు మార్లిన్‌లో కనిపించింది. ఆ అమాయకత్వం కూడా నవ్వులతో మురిపించింది.

ఆమె ముందు నన్ను చూడలేదు. సరాసరి ఆర్థర్ దగ్గరి కెళ్లింది. ఎంతో ప్రేమతో పలకరించింది ఆయన్ని!

ఆర్థర్ ఏమనుకొన్నారో, ఏమో వెంటనే ''హ! హనీ! మనకు అతిథు లొచ్చిన వేళయిది'' అన్నారు.

అప్పుడుగాని, ఆమె నన్ను చూడలేదు అర్థర్ నన్ను ఆమెకు పరిచయం చేశాడు మార్లిన్‌కు ఆర్థర్ అంటే ఎంతో ప్రేమ, ఆత్మీయత. ఆమె, అతని భుజాలమీద మత్తుగా వాలి పోతూ ''నేనంతో అదృష్టవంతురాల్ని. మావారెంతో గొప్పవారు'' అను కొంటూ, ''కాదా!'' అన్నట్లు నా వంక చూసింది.

ఏమి చెప్పగలను? మెల్లిగా నవ్వాను.

అదే ఆరోజున స్టూడియోలో మార్లిన్‌కు 'కెమెరా టెస్టులు' తీసికొన్నాం. ఆమెతో ఎంతో మర్యాదగా మాట్లాడి, గౌరవించాను నేను.

మార్లిన్‌తో ఎంతో జాగ్రత్తగా ఉండాలి. అంతకుముందు ఆమె నటించిన పిక్చర్ ఒకటి డైరెక్ట్ చేసిన సర్ లారెన్స్ ఒక వర్తమానం పంపుతూ, ''ఏమయినా జరగనివ్వండి. మార్లిన్‌తో ఎలాంటిపరిస్థితుల్లోనూగట్టిగా మాట్లాడవద్దు'' అని వ్రాశారు. ''అప్పుడే మనం మన పిక్చర్ తీయగలుగుతాం'' అన్నారు.

''ఆమె ఎలాంటి మందలింపుకూ తట్టుకోలేదు. ఆమె దేహస్థితి అలాంటిది. మానసిక పరిస్థితి అంతే'' అని దర్శకుడు సర్ లారెన్స్ వ్రాశారు.

మార్లిన్ అనాధశరణాలయంలో పెరిగి పెద్దదైంది. ఆమె బాల్య జీవితం అంతా కష్టాలమయం. ఆమె నడిచిన బాటలో ముళ్లే కనిపించాయిగాని, గులాబీలు పూయనే పూయలేదు.

హాలీవుడ్‌లో ఆమె అజ్ఞాతంగా చాలాకాలం వుండి పోయింది. ఆ 'అజ్ఞాతవాసం' అంతా ఆమె మంచితనాన్ని మోసం చేసింది. ఆమెకు జీవితంమీద, చుట్టూ వుండే ప్రపంచమీద అసహ్యం వేసింది ఆ రోజుల్లోనే. అప్పటి నుంచీ అలా అయిపోయిందంటారు తెలిసిన వారంతా.

ఆమె గడ్డు జీవితం ఎలాంటిదో నాకూ కొద్ది కొద్దిగా అప్పుడే తెలిసింది.....స్టూడియోలో ఒకసారు ఆమె పాలలా మెరిసిపోయే తెల్లని గౌను వేసికొంది. ఆ గౌనులో వున్న మార్లిన్ తెర మీద ఎంతో అందంగా కనిపించింది. ఆమెను కెమెరాకు సరిపోయేలా చూచేందుకు దగ్గరి కొచ్చాను. ఆమె చేతులు.... నిజంగా నాకు ఆశ్చర్యం వేసింది! లాలిత్యం, నాజూకుతోను మిలమిలలాడవలసిన ఆ చేతులు గట్టిగా, మొద్దుబారి పోయి వున్నాయి

అది చూచాక, ఆమె చేతులకు కొంత 'మేకప్' అవసరం అనిపించింది నాకు. ఎర్రగా మొద్దుబారిపోయిన ఆ చేతులు చూస్తుంటే నాకు ఏదోలా అనిపించింది. పైగా కలర్ కెమెరాలు, యీ చేతులను పసిగట్టాయంటే అసలు పిక్చర్‌కే ప్రమాదం.

'మేకప్' వేసికోవాలని నే చెప్పిన సూచనకు జవాబు ఎలా వుంటుందోనని భయపడ్డాను. కాని నేనను కొన్నట్టేమీ జరగలేదు. మెల్లిగా మార్లిన్

"అలాగే, తప్పకుండా వేసికొంటాను" అంది.

"ఈ చేతులు ఎప్పుడో మొద్దుబారి పోయాయి. ఆరోజుల్లో నేను అనాథశరణాలయంలో ఉండేటప్పుడు, యిళ్లుచిమ్మి, డిగి—పనంతా చేయవలసి వచ్చేది. అందు ల్లి యిలా అయింది" అంది మార్లిన్.

అంత జాలిగా మాట్లాడుతుంటే క్కూడా జాలిపడక తప్పలేదు. 'పాపం' నుకొన్నా.

ఆమెకు స్వతహాగా పెద్ద చదువులేదు.

నాకు బాగా పరిచయం అయ్యాక, ఆమెకు డైలాన్ థామస్ వ్రాసిన పద్యాల పుస్తకాలు యిచ్చేవాణ్ణి. సెట్టుమీదనే రిక దొరికినప్పుడల్లా ఆమె నన్నడిగి, తెలియనివన్నీ చెప్పించుకొంటూ ఉండేది. రసిక జనులు ఆరాధించేంతటి అందం అది. కాని ఏం లాభం? ఆమె ప్రవర్తనచూస్తే, ఒక్కోసారి "ఎందుకొచ్చిందిరా యీ బాధ" అనిపిస్తుంది. ఆమెతో పిక్చర్స్‌లో పని చేయాలన్నా, యిదే సమస్య ఎదురయేది.

సర్ లారెన్స్ ఆలివర్ ఒక్కరే ఆమెతో ఎంతో చాకచక్యంతో ప్రవర్తించారు. లారెన్స్ పేరు చెప్పితే నేను యిప్పటికీ "హాట్సాఫ్" అనుకొంటాను.

కాని, యీబాధలన్నీ లారెన్స్‌కు తెలియక పోతే గదా?

మహానటి కావాలనే కాంక్షతో మార్లిన్ ఎన్నో పనులు చేసేది. కొత్త కొత్త నటన ప్రారంభించేది. ఆ హడావుడిలో ఆశయ పూర్వకమైన భావ ప్రకటనకు, నామమాత్రమైన నటనకు పొత్తు కుదిరేదికాదు దగ్గరికొచ్చి, నన్నే సలహా అడిగింది. నే నో మాట చెప్పాను— పాత రెయిన్‌కోటు, పాత ధరలో చెప్పులు, చినిగిపోయిన స్టాకింగ్స్ వేసికొని వెళితే ఎవరూ గుర్తుపట్టరని చెప్పాను. ఈమాట ఆ అమ్మాయికి చాలాబాగా నచ్చింది. అమర్నాడే ఆ అమ్మాయి నా దగ్గర కొచ్చి, "చూడు. నా రూపమే మారి పోయింది. ఎలా వున్నాను?" అంది.

ఆ అమ్మాయి నల్లటికళ్లద్దాలు ధరించి వుంది. కాని, తలమీద పెట్టుకొన్న "విగ్గు" మాత్రం చాలా ఆకర్షణీయంగావుంది. నా కప్పుడే అనుమానం వేసింది.

"చూడు మార్లిన్! నీ 'విగ్గు' ఎంతో అందంగా ఉంది. ఇంత అందంగా ఉన్నప్పుడు యీ విగ్గు ఎవరిదో, నీవెవరోనయినా



జాక్ కార్డిఫ్

గత రెండు దశాబ్దాలలో ప్రజాజీవనంలోను, దేశీయంగాను వచ్చిన పరిణామాల మూలంగా 'ఇండియా' లాంటి సాంప్రదాయబద్ధమైన దేశాలలోకూడా సినిమా తారలు ఒక్కమారు పున్నట్టుండి పూర్తిగా మారిపోయారు. 'సినిమాతారల'ను గురించి తెలిసిన వారికీ, తెలియనివారికీ కూడా 'ప్రత్యేకమైన అభిప్రాయాలు'న్నాయి.

'ఇండియా'లోనే యిలా వుంటే ఇక బ్రిటన్‌లాంటి 'అధునాతనమైన' దేశాల్లో వుండే సినిమా తారలు ఎలా వుంటారు?...వారి కథలే యీ సచిత్ర వ్యాసశీర్షిక.

జాక్ కార్డిఫ్ బ్రిటన్‌లోని అగ్రశ్రేణి ఫొటోగ్రాఫర్లలో ఒకరు. ఈ వృత్తిలో, ఆస్కార్ బహుమతి పొందిన మొదట వ్యక్తియాయనే.

సినిమా తారలకు సంబంధించిన 'అన్ని' విషయాలు తెలిసిన బహుకొద్ది మందిలో ఫొటోగ్రాఫర్లు కూడా వుంటారు. జాక్ కార్డిఫ్ యిందుకు అతీతులు కారుకదా ?

ఒక్కమాట : రచయిత జాక్ కార్డిఫ్ వ్రాసే సంగతులకు మూలాధారం ఆయన 'డైరీ' మాత్రమే. ఈ ఫొటోలు, వారి స్వంత 'ఆల్బమ్'లోనివి !

ఆర్థర్ మిల్లర్ అంటే ఆమెకు వల్లమాలిన అభిమానం, ప్రేమ. ఆమెకు రక్షణ, బుద్ధిబలాన్ని యిచ్చింది ఆర్థర్ కావటమే అందుకు ఒక కారణం అనుకొంటా.

అందమైన హృదయం, అంతకంటె అందమైన శరీరం ఆమెకు యింతటి కీర్తి ప్రతిష్ఠలు సాధించి పెట్టాయి. కొల్లలంత డబ్బును తెచ్చాయి.

అందరూ ఆమెకు బ్రహ్మరథం పట్టాలని, ఆమె నడిచే అడుగులకు లోకం మడుగులనొత్తాలని మార్లిన్ ఎప్పుడూ వాంఛించలేదు. ఆమె ఆశించినదల్లా ఒకటే! అందరూ తనను ఒక మంచి నటి అనుకోవాలనే.

"స్లీపింగ్ ప్రిన్స్" విడుదలయాక ఆమె తన ఆశయాన్ని చాలా వరకు సాధించానని అనుకొంటూ వుండేది.

కొన్ని సందర్భాలలో.

'స్లీపింగ్ ప్రిన్స్'తో ఎలాగయినా తాను రాణించాలని ఆమె ఎన్నో ప్రయత్నాలు చేసింది. బుద్ధికి తోచిన నటనంతా చేసింది. కొందరి కిది ఎబ్బెట్టుగా తోచినా, మరికొందరికి నచ్చింది.

ఆలివర్ ఆమెకు 'డైరెక్షన్స్' యిస్తున్నప్పటికీ ఒక్కోమారు ఆమె తన యిష్టం వచ్చినట్లు చేసేది.

ఆమెకు 'జనం' అంటే విపరీతమయిన భయం. సెట్టులో కూడా నలుగురున్నప్పుడు నోరు తెరిచి మాట్లాడాలంటే, ఆమెకు బ్రహ్మ ప్రళయం అయ్యేది.

ఒకమారు ఆమె స్వయంగా 'షాపింగ్'కు వెళ్లాలనుకొంది. కాని అదెలా సాధ్యం ?

చూసేందుకు జనం వెంబడిస్తారు. ఏమంటావ్?" అన్నాను.

మార్లిన్ ఎగాదిగా చూసింది. కొంచెం కోపం వచ్చింది కూడా. అందులోనే చిలిపితనం వుంది. కాని, నే చెప్పిన మాట నచ్చింది ఆమెకు. కనుబొమలు రెండూ ఎగురవేస్తూ తన కేమీ తెలియనట్లు "ఐ సీ" అంది

ఇదీ మార్లిన్ మన్రో కథ. ఇలా వుంటారు తారలు, మా దేశంలో. అన్ని రకాల భావాల, అన్ని రకాల తత్వాల సమ్మేళనం మార్లిన్. మంచి నటి యీమె. అందమైన యీమె విగ్రహం. అంతకంటె పదునైన మనస్సు. కాని, చాలా పసిది. చిలిపితనం చిందులు త్రొక్కేది.ఆ అర్హత ఆమెకు వున్నది కూడా!

జాక్ కార్డిఫ్

# సమీక్ష:

ఎంతో ఆశతో ఎదురు చూసిన, 1965 కూడ వెళ్లిపోయింది. అన్ని రంగాల్లోనూ యీ సంవత్సరంయొక్క ప్రభావం బాగా పడినట్లు సంఘటనలు, వార్తలు తెలుపుతున్నవి కాని సినిమారంగంమీద 1965 తన ప్రభావాన్ని ఎలా ప్రసరింపజేయగలిగిందీ అన్నది ప్రస్తుతాంశము

సహజంగా సినిమారంగం, యిందుకు సంబంధించిన వ్యక్తులు వివాదాంశులవుతారు. ఈ రంగానికి సామాన్యుల్లో కూడా ఎంతో పలుకుబడి ఉండటమే దీనికి కారణం. ఏమైతేనేం 1965 తెలుగు సినిమా రంగానికి పెద్దగా లాభదాయకమైన సంవత్సరం అని చెప్పడానికి వీల్లేదు అంతమాత్రాన యీ సంవత్సరాన్ని పూర్తిగా నిష్ప్రయోజనకర సంవత్సరంగా ఎంచి తీసివేయనూ లేము ఈ సంవత్సరంలో సినిమా రంగంలో జరిగినన్ని సంఘటనలు మరెక్కడా కనిపించవు

1965 ముప్పయిఒక్క తాజా చిత్రాలను పదునెనిమిది అనువాదచిత్రాలను తెలుగు చూడ గలిగింది ఎనిమిది చిత్రాలు శత దినోత్సవాలు జరుపుకున్నాయి 1964 లో విడుదలయిన చిత్రాలలో కూడా 1965 లోనే రెండు చిత్రాలు శత దినోత్సవాలు జరుపుకున్నాయి

## కొన్ని ముఖ్య సంఘటనలు

ఈ సంవత్సరంలో ఎన్నో ముఖ్య సంఘటనలు జరిగాయి. కళాకారులంతా దేశరక్షణ కోసమైతేనేమి, దాన ధర్మాలు కోసమైతేనేమి యీ సంవత్సరంలో ప్రదర్శనలు యిచ్చారు శ్రీ రామారావు పోలీసు కుటుంబాల కార్యక్రమంతో యీ ప్రదర్శనల ఉత్సాహం ప్రారంభమయింది తర్వాత శ్రీ ఎన్. టి. రామారావు దేశరక్షణనిధికోసం యన్ టి ఆర్ డిఫెన్సు ఫండ్ నొకదానిని ఏర్పరచి ఆంధ్రదేశంలోని ప్రధాన కేంద్రాల్లో ప్రదర్శనలకువెళ్లి దాదాపు ఎనిమిది లక్షలు వరకు వసూలుచేసి ప్రధానిగారికి సమర్పించడం జరిగింది ఇక భారీ ఎత్తున సినీ కళాకారులు దేశరక్షణకు విరాళాలు వసూలు చేయడం, ప్రధానిలాంటి అగ్రశేణి వ్యక్తికి సమర్పించడం— యిదే గర్వించదగిన విషయం మరికొందరు నటీనటులు కలిసి దేశరక్షణకు యథోచితంగా హైదరాబాద్‌లో, ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డికి తమ స్వంత డబ్బును విరాళంగా అందజేశారు దీనికి శ్రీ అక్కినేని నాగేశ్వరరావు అధిపత్యం వహించారు. రక్షణ కృషిలో ఒక భాగంగా తెలుగులో సంక్షిప్త చిత్రం ఒకటి తయారైంది తెలుగు దేశంలో యీ చిత్రం బాగా ఆకర్షిస్తున్నదనే వార్తలు వస్తున్నాయి.

## క్రొత్తతారలు

1965 యింకా ఎన్నో విశేషాలను మన ముందు ఉంచింది శ్రీ ఆదుర్తి సుబ్బారావు 1964 లో అగ్రశేణి తారలతో మూగమనసులు చిత్రం ద్వారా అఖండ విజయాన్ని సాధించారు 1965లోకూడా ఆయన ఘనత

# మంచి - చెడుల సమన్వయం -



లేతమనసులు—సుకన్య, సంధ్యాశాంతి !

మరొకసారి దేశ వ్యాప్తం కావటానికి కారణం అగ్రశేణి తారలుకాదు క్రొత్తవారి ప్రతిభ మాత్రమే. అందరూ క్రొత్త నటీనటులతో ఇండియాలో నిర్మించబడిన మొదటి చిత్రం తేనె మనసులు ఈచిత్రం విజయవంతమైంది ఇలా పరిచయమైన నటీనటులకు ఇతరత్రా కూడా మంచి అవకాశాలే వస్తున్నాయి ఇది శుభసూచకం ఇదే సంవత్సరంలో తెలుగు తెరకు 'ఇల్లాలు' చిత్రం ద్వారా మరో నాయకుడు పరిచయం అయ్యాడు ఖరగ్‌పూర్‌నుంచి వచ్చిన శ్రీ కె వి నాగేశ్వరరావు అవకాశాల మేరకు మంచి నటననే ప్రదర్శించగలిగారు ముందు ముందు ఆ అవకాశాలెలా ఉంటాయో?

## కార్కాలో కీలుబొమ్మలు

కార్కాలో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలకు భారతదేశంనుంచి ఎన్నిక అయిన ఒకే ఒక చిత్రం, తెలుగు చిత్రం 'కీలుబొమ్మలు' కావటం ఆ బృందానికేకాక తెలుగువారికి కూడా గర్వకారణం. పదిరోజులపాటు జరిగిన యీ చలన చిత్రోత్సవాల్లో పాల్గొనేందుకు నాయకులు శ్రీ జగ్గయ్య

# 1965 లో సినిమారంగం



నటి వహీదా రెహమాన్

దర్శకులు శ్రీ పి. యస్. రావు, నిర్మాత శ్రీ పి. గంగాధరరావు ప్రభృతులు వెళ్లి వచ్చారు. అక్కడ పత్రికలు, ప్రజలు మన 'కీలు బొమ్మలు' చిత్రాన్ని బాగా ప్రశంసించడం జరిగింది. ఇదే సందర్భంలో శ్రీ జగ్గయ్య విస్తృతంగా యూరోప్ పర్యటన చేశారు.

## భానుమతి, నారాయణరెడ్డి గార్లకు అవార్డులు

గత సంవత్సరంలో ఉత్తమమైన రచనలను వెలువరించినందుకుగాను కథానికలకు శ్రీమతి భానుమతీ రామకృష్ణకు, పద్య కవితకు శ్రీ సి. నారాయణరెడ్డికి అవార్డులు వచ్చాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఇచ్చిన ఈ పురస్కారాలను ప్రదానం చేశారు వీరిద్దరూ సినిమారంగంలో వేరెండు వేర్వేరు విభాగాల్లో నిష్ణాతులు. శ్రీమతి భానుమతి ప్రజ్ఞ గల నటి మధురగాయని శ్రీ నారాయణరెడ్డి తెలుగు సాహితీరంగంలోనే మధుర కవితను పరిమళింపజేసిన విజ్ఞులు రామన్న రోజుల్లో కూడా వీరిరువురి రచనా వ్యాసంగం మూడు పువ్వులు ఆరు కాయలుగా విలసిల్లాలని ఆశిద్దాం

## మంచి చిత్రాలు లేవు

1965లో విడుదలైన 49 చిత్రాల్లో తెలుగైదు చిత్రాలు ప్రజాదరణ పొంది ఇప్పటికి మరీ గొప్పగా చెప్పుకోవలసిన చిత్రం ఒక్కటీ రాలేదు కాగా ఈ 49 చిత్రాల్లో అనువాద చిత్రాలు 18 వరకు ఉండటం దురదృష్టకరం. మిగిలిన చిత్రాలు కూడా ఇంతవరకు విడుగు—బొదుగులేని తెలుగు సినిమా పరిశ్రమ స్థాయితో తులతూగుతూనే ఉన్నాయి. పెద్ద దర్శకులు తీసిన రెండు మూడు చిత్రాలు వాటి విపరీత ధోరణితో అల్ప సంఖ్యాకులకు నచ్చినా అధిక సంఖ్యాకులను మాత్రం ఆకట్టుకోలేకపోయాయి మరి వీటి పరమార్థమేమిటో?

## హైదరాబాద్‌లో మరో స్టూడియో

పరిశ్రమ అంతా యిలా ఉండగా హైదరాబాద్‌లో సినిమా పరిశ్రమ శరవేగంతో వేళ్లు తన్నుకుంటున్నది మొదటినుండీ ఉన్న శ్రీ సారథి స్టూడియోస్‌కు జతగా సదరన్ మూవీటోన్ తయారైంది శ్రీ సారథి స్టూడియోస్‌లో మరో, ఫ్లోర్ నిర్మాణానికి శంకుస్థాపన జరిగింది శ్రీ నాగేశ్వరరావు విరామం లేకుండా పని చేస్తున్నారు

మొత్తంమీద మనమంతా వింత ఆశతో ఎదురు చూసిన 1965 రానూ వచ్చింది పోనూ పోయింది కాని ఏమి సాధించిందనేదే ప్రశ్న?

## చిత్రాలు - వివరాలు

1965 సంవత్సరంలో తాజా చిత్రాలు 31, అనువాద చిత్రాలు 18 మొత్తం 49 చిత్రాలు విడుదల అయినవి 1964 సంవత్సరంలో విడుదలయిన చిత్రాలతో కలిపి 1965 సంవత్సరంలో శత దినోత్సవాలు జరుపుకున్న చిత్రాలు 10. శ్రీయుతులు వేదాంతం రాఘవయ్య శ్రీ ఆదుర్తి సుబ్బారావు, బి. విఠలాచార్య, సి. యస్. రావు వీరు నలుగురూ 1965 లో మూడేసి చిత్రాలకు దర్శకత్వం చేశారు. అంతకు మించి ఎక్కువ చిత్రాలకు ఎవరూ దర్శకత్వం చేయలేదు. ఈ సంవత్సరంలో ఎక్కువ చిత్రాలలో నటించినవారు శ్రీ ఎన్. టి. రామారావు. వీరు 11 చిత్రాల్లో నటించారు కృష్ణకుమారి 8 చిత్రాలలో నటించారు

1965 సంవత్సరంలో విడుదలైన చిత్రాలలో ఎక్కువ నిడివిగల చిత్రం మాధవీ ప్రొడక్షన్సువారి "పాండవవనవాసం' 5882 మీటర్ల ఫిలింను వినియోగించారు తక్కువ నిడివిగల చిత్రం ఆలయ ఫిలింస్‌వారి "పిలా వాహా.' 3481 మీటర్ల ఫిలింను వినియోగించారు.

1965 లో విడుదలైన చిత్రాలలో సాంఘికాలు—27, పౌరాణికాలు—10, జానపద, చారిత్రిక చిత్రాలు—12 ఉన్నవి. ఈ సంవత్సరంలో నూతన నిర్మాతలు—24.

తెలుగు చిత్రాలు మొత్తం 2,22,878 మీటర్ల ఫిలింను వినియోగించారు. సగటున 4549 మీటర్ల ఫిలిం వినియోగపడింది.

| | | | |
|---|---|---|---|
| (1931 సంవత్సరం నుండి | | | |
| 1959 వరకు | | 432 | చిత్రాలు |
| 1960 | — | 55 | — |
| 1961 | — | 54 | — |
| 1962 | — | 46 | — |
| 1963 | — | 45 | — |
| 1964 | — | 41 | — |
| 1965 | — | 49 | — |

1931 సంవత్సరం నుండి 1965 వరకు 722 చిత్రాలు విడుదలయినవి. (అనువాద చిత్రాలతో సహా).

—ధర్మాజీ



'గుమ్నామ్' చిత్రంలో నందా.

## గుమ్నామ్: చిత్రసమీక్ష

భయంకరమైన దీవికి చేరిన ఏడు గురు వ్యక్తులను నిరాశా, నిస్పృహలతో బంధించివేయటానికి, క్రమేణా వారిలో కొందరిని ఒకరి తరువాత ఒకరిని హత్య చేయటానికి వచ్చిన వన్నాగమే 'గుమ్నామ్' కథ అపరాధ పరిశోధన మూలాధారంగా తీసికొంటూ, దీనికి అందమైన పాశ్చాత్య నృత్యాలను జోడించి, కొంతలో కొంత మంచి సంగీతాన్ని వినిపించిన 'గుమ్నామ్' చిత్రాన్ని దేశంలో అన్ని ముఖ్య కేంద్రాలతోబాటు, మద్రాసులో కూడా యిటీవలనే విడుదల చేశారు

ఈ ఏడు మందిలో ఐదుగురు హతులవుతారు మిగిలిన యిద్దరూ నాయికానాయకులే!

మనిషిలో కక్ష, ద్వేషం పెరిగితే, అవి ఎలాంటి తీవ్రతర పరిణామాలకు దారి తీస్తాయో యీ కథ తెలుపుతుంది నమ్మిన వ్యక్తులు, అనుచరులు కొందరు చేసిననమ్మక ద్రోహంపై ఒక పామాన్యుడు ఎలా ప్రతీకారం తీర్చుకొన్నదీ యీ కథ తెలుపుతుంది.

కన్నుల కింపైన రంగులలో తయారయిన యీ చిత్రం, మనల్ని అడుగడుగునా భయభ్రాంతులనుచేస్తూ, మూడు గంటలసేపు మన మనసుమీద, మన నిర్ణయాలమీద అధికారాన్ని చలాయిస్తుంది తెరపై కనిపించే కొందరు వ్యక్తులు ప్రేక్షకుల్ని కూడా "మోసం" చేస్తారు ఇన్ని జరిగినా, "మంచి సినిమా చూశాం" అనే తృప్తితోనే "గుమ్నామ్" ముగుస్తుంది.

రాజ్ నవాత్ దర్శకత్వం మెచ్చతగినది. శంకర్ జైకిషన్ సంగీతమూ అంతే పాటలన్నీ బాగున్నాయి 'సస్పెన్స్ థ్రిల్లర్' అనే భావం ప్రతి సన్నివేశంలోనూ కనిపిస్తుంది.

మనోజ్, నందా, ప్రాణ్, హెలెన్, మెహమూద్ ప్రభృతులు నిజంగా వారి పాత్రలకు జీవం పోశారు

ఇంగ్లీషు సంగీతపు బాణీలతో పాటు హెలెన్ నృత్యాలు..... 'ఓ హెూ' మనిపిస్తాయి.

—ప్రకాశం ●